# ఆంధ్ర ప్రదేశ్

డిసెంబరు, 1971
(మార్గశిర - పుష్య, 1893 శా. శ)

సంపుటి : 16 సంచిక : 2




ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు

సంపాదకులు : కప్పగంతుల లక్ష్మణశాస్త్రి



ముఖ చిత్రం : సరోవర సౌందర్యం

రెండవ అట్ట : బంజారా వృద్ధ వనిత

చివరి అట్ట : విద్యా దీక్ష

వెల : 50 పైసలు

సాలు చందా : 6 రూపాయలు

రిజిష్టర్ నెంబరు : 133

# దేశరక్షణ సన్నద్ధత

బంగ్లాదేశ్ సమస్య, పొరుగుదేశంవల్ల మన దేశ భద్రతకు కలుగనున్న బెడద—యీ రెండూ మనలను ప్రధానంగా కలవరపెడుతున్న సమస్యలు. పాకిస్తాన్ మిలిటరీ పాలకులు ప్రారంభించిన జనహత్యాకాండ ఫలితంగా మనదేశంలోకి పారిపోయి వచ్చిన సుమారు కోటి మంది బంగ్లాదేశ్ శరణార్థుల పోషణ భారం మన భుజస్కంధాల మీద పడడంవల్ల మన ఆర్థిక వ్యయం ఎక్కువైంది. భారత ప్రజలు యీ భారాన్ని మనస్ఫూర్తిగా వహిస్తున్నారు. ఇది వారి గాఢమైన దేశభక్తికి నిదర్శనం. కేంద్రంగానీ, రాష్ట్రంగానీ, శరణార్థుల పోషణ కోసం విధించిన అదనపు చార్జీలకు ప్రజలనుండి వచ్చిన సుముఖతవల్ల, భారత ప్రజలు, ఒక అమానుష మిలిటరీ ప్రభుత్వం బంగ్లాదేశ్ మీద సాగిస్తున్న దమన కాండ మన దేశ భద్రతతో గాఢంగా ముడిపడి వున్నదనే విషయం గ్రహించారనేది స్పష్టంగా తెలుస్తున్నది. భారతదేశానికి యితర దేశాల పట్ల ఏ విధమైన దురాక్రమణ దురుద్దేశాలు లేవు. మనం నూటికి నూరుపాళ్లు శాంతి కోసం కృషిచేస్తున్నాం. కాని 1947 లో అవతరించినప్పటి నుండి భారత దేశం మీద ఎన్నోసార్లు దురాక్రమణ చర్యలు జరిపిన పాకిస్తాన్ యిప్పుడు చేస్తున్న యుద్ధ సన్నాహాలను మనం గుర్తించక పోలేదు. ఇటీవల నవంబరు రెండవ వారంలో విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలో మూడు రోజులపాటు పర్యటించిన మన రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి గారు పాల్గొన్న అనేక సభలలో మన దేశపు దేశరక్షణ సన్నద్ధత ఆవశ్యకతను గురించి స్పష్టంగా నొక్కి చెప్పారు.

రాష్ట్రపతి పదవి స్వీకరించిన తర్వాత మొదటి సారిగా యీ ప్రాంతాలను సందర్శించడానికి వచ్చిన శ్రీ వి. వి. గిరి గారికి ఎక్కడికి వెళ్ళినా ప్రజలు ఘనమైన స్వాగతం యిచ్చారు. మన ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారు కూడా రాష్ట్రపతి వెంట పర్యటించారు. కష్టపడి పని చేయాలనీ, ఆర్థిక స్వరాజ్యాన్ని సాధించడంలో సహకరించాలనీ రాష్ట్రపతి ప్రజలను ఉద్బోధించారు. నక్సలైట్ కార్యకలాపాలు కొనసాగినట్టి జిల్లా అయిన శ్రీకాకుళంలో అఖిల భారత గిరిజన సంక్షేమ మహాసభ జరగడం వల్ల గిరిజనుల సమస్యలకూ, వారి సమగ్ర అభివృద్ధి కోసం ప్రభుత్వం తీసుకున్న చర్యలకూ ప్రాధాన్యం యిచ్చి ప్రసంగించడానికి రాష్ట్రపతికి అవకాశం లభించింది. నక్సలైట్ల హింసాకాండను తుదముట్టించినందుకూ, తద్వారా దేశంలోని యితర ప్రాంతాల ప్రజలందరి కృతజ్ఞతాపూర్వకమైన మెప్పు పొందినందుకూ, మాజీ ఉపప్రధాన మంత్రీ, భారతీయ ఆదిమజాతి సేవక సంఘ అధ్యక్షులూ అయిన శ్రీ మొరార్జీ దేశాయ్‌గారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని అభినందించారు.

గిరిజన ప్రజల సత్వరాభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం అధిక ప్రాధాన్యం యిస్తున్న విషయాన్ని ముఖ్యమంత్రి ప్రస్తావించారు. ఒక యువకుడూ, పట్టభద్రుడూ అయిన మంత్రి ఆధ్వర్యంలో కొత్తగా గిరిజన సంక్షేమ మంత్రిత్వ శాఖను ఏర్పాటు చేసినట్లు ఆయన చెప్పగానే మహాసభలోని ప్రజలందరూ పెద్ద పెట్టున హర్షధ్వానాలు చేశారు. అదేవిధంగా నెహ్రూ జయంతి సందర్భంగా హైదరాబాదులోనూ, అంతకుముందు విశాఖపట్టణంలోనూ జరిగిన బాలబాలికల సమ్మేళనాలలో, శిశు సంక్షేమ కార్యక్రమాలను ఆరోగ్య, విద్యా, తదితర శాఖలనుండి విడదీసి ప్రత్యేకంగా ఒక మహిళామంత్రి ఆధ్వర్యంలో ఏర్పాటుచేసిన విషయం ముఖ్యమంత్రి ప్రస్తావించి నప్పుడుకూడా హర్షామోదాలు లభించాయి. వరంగల్లులో వివిధ కార్యక్రమాల్లో పాల్గొనడానికై విశాఖపట్టణం నుండి ముఖ్యమంత్రి వరంగల్లు వెళ్ళినప్పుడు ఆయనకు అపూర్వమైన ఘనస్వాగతం లభించింది. లోగడ జరిగిన ఆందోళన దృష్ట్యానూ, వివిధ చర్యలు గైకొనడంద్వారా సమైక్యత సుస్థిరత్వాన్ని సాధించాలన్న ముఖ్యమంత్రి కృత నిశ్చయం దృష్ట్యానూ చూసినప్పుడు దీనికి ఎంతో ప్రాధాన్యం వుంది. చారిత్రిక ప్రాధాన్యం కలిగి శోభాయమానమైన వరంగల్లు నగరం, అక్కడి వేయి స్తంభాల దేవాలయం, కోట, శిల్ప సౌందర్యానికి ప్రసిద్ధి చెందిన రామప్ప దేవాలయం — యివన్నీ చూస్తే తెనుగు ప్రజలు సాధించిన ఘనవిజయాలూ, వారి పూర్వ ఔన్నత్యం మన స్మృతి పథంలోకి వస్తాయి. తెలంగాణా ప్రాంతానికి రాజకీయ, సాహిత్య చైతన్య కేంద్రమైన వరంగల్లుకు మంచి భవిష్యత్తు వుంటుందని ముఖ్యమంత్రి ప్రకటించడం హర్షించదగిన విషయం. చరిత్ర ప్రసిద్ధమైన వరంగల్లులో విశ్వవిద్యాలయం స్థాపించడంతో అక్కడి ప్రజల న్యాయమైన ఆశయం సఫలీకృతమవుతుంది. వైద్య కళాశాల, ఇంజనీరింగ్ కళాశాల వుండడంవల్ల విశ్వవిద్యాలయ స్థాపనకు తగిన వాతావరణం యిప్పటికే నెలకొని వుంది. విద్యార్థి దశలో చాలాకాలం వరంగల్లులో గడిపి, ఆ తరువాత కూడా కొంతకాలం అక్కడఉన్న ముఖ్య మంత్రి ప్రత్యేకంగా అక్కడి విద్యార్థుల సమావేశంలో పాల్గొన్నారు. మన దేశ సరిహద్దుప్రాంతాలలో నేడు నెలకొని వున్న పరిస్థితుల దృష్ట్యా, ప్రజలందరూ సమైక్యంగావుండాలనీ, బైటనుండి కలిగే దురాక్రమణ ప్రమాదాన్ని ఎదుర్కోవడంలోనూ దేశంలోపలి సమస్యలను పరిష్కరించుకోవడంలోనూ ప్రభుత్వంతో మనస్ఫూర్తిగా తోడ్పడ వలసిందనీ ముఖ్యమంత్రి ప్రజలను ఉద్బోధించారు.

—పి. వి. ఆర్.

# ప్రజయే ప్రకాశం

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి



వందలు వేలు దెచ్చుకొను వాక్పటి మంబున
న్యాయవాదవై
అందరి మన్ననల్ బడసినట్టి ఘనుండవు
దేశ మాత ఆ
క్రందన వీనులం జొరగ ఖైదులు, కాల్పులు
లెక్కచేయ కా
నందము తోడ లేమినె ఘనంబు నెంచితి
వాంధ్ర కేసరీ !

విజయ పరాజయంబులకు వీసము పొంగక
క్రుంగ కెప్పుడున్
నిజమగు యోగి చందమున నిర్మల కర్మ
పథాను వర్తివై
ప్రజల మనస్సు చూరగొని పాలన చేయుటచే,
"ప్రకాశమే
ప్రజ" యనుమాట తెల్గు భువిపై ప్రతి
నోట బహిర్గతంబగున్.

వందలు వేలు సంపాదించియును గూడ
అనికేతనుండైన త్యాగ గరిమ
ముప్పు లెక్కింపక ముక్కుకు సూటిగా
ధర్మంబు దప్పని ధైర్య పటిమ
గుండె పెట్టబడినట్టి కడకు తుపాకికి
జంకక రొమ్మిచ్చు సాహసంబు
పదవు లెన్నైన చేపట్టి యొక్కింతయు
స్వార్థంబులేని సేవాభిలాష

ఆంధ్రకేసరికే చెల్లు ; నన్యు లెవరి
కైన సమకూరునే ? యావదాంధ్ర భూమి
నఖిల జనుల కృతజ్ఞతలంది కొనుచు
శాశ్వతముగ తదాత్మకు శాంతి యగుత !

కలగంటి మొకనాడు కల్లు సారాయి పి
శాచమ్ములన్ గెంటజాలుదు మని
కలగంటి మొకనాడు కులమత ప్రాంత, భా
షా భేదముల దాట జాలుదు మని
కలగంటి మొకనాడు కట్ట గుడ్డయు తిండి
జనులెల్లరకు కూర్పజాలుదుమని
కలగంటి మొకనాడు విలువైన నైతిక
స్థాయి పెంపొందింప జాలుదుమని

స్వార్థ మెఱుగని నిష్పక్షపాత బుద్ధి
చిత్తనైర్మల్యమును క్రమశిక్షణంబు
ప్రజల నెల్లర నుత్తేజ పరచెద మని
కలలు గంటిమి స్వాతంత్ర్య కదనమపుడు.

పూల చెండ్లుగ తుపాకీల గుండ్లకు స్వాగ
తము పల్కి నిలిచిన ధైర్యధనుడు
తృణ సమంబుగ దివ్య మణిమందిరమ్ముల
తలపోయ గలిగిన త్యాగధనుడు
బిరుదమ్ములుగ బ్రిటిష్ చెరసాల శిక్షకై
పరుగులెత్తిన దేశభక్తి ధనుడు
తనకష్టములుగ దేశమున నందరి పాట్లు
వీక్షింప గల్గిన ప్రేమ ధనుడు

సంతత స్మరణీయుడై సత్యశాంతి
పథము జూపుచు దీపికల్ పట్టినతని
కలలు పండునటుల్ దేవతలకు మ్రొక్కి
నడుచుకొను దృఢ దీక్ష బూనంగవలయు.

# ఆంధ్రకేసరి ప్రకాశం

అక్కిరాజు రమాపతిరావు

ఆంధ్రకేసరి జీవితం అద్భుత రసప్రధానం.

నవరస భరితమున్నూ.

ఆయనవంటి వ్యక్తులు ఒక జాతిలో, ఒక దేశంలో అరుదుగా పుడతారు.

కొన్ని వందల సంవత్సరాలకు గాని అలాంటివాళ్ళు పుట్టరు.

ఆయన పేరు తెలుగువాళ్ళ సంస్కృతిలో శాశ్వతంగా నిలిచిపోతుంది.

అటువంటి రాజకీయనాయకుడు 'నభూతో నభవిష్యతి'

అని ఎందుకనాలికాని?? ఆ త్యాగం ఆ సాహసం, ఆ దీక్ష దీనుల పట్ల కరుణ, గాంభీర్యం, మరి ఎవరిలో కనపడేను?

పుట్టింది నిప్పచ్చరపు పేదకుటుంబంలో.

అయినా మహారాజాధిరాజులూ, మకుటాధిపతులూ చేయలేని త్యాగాలు చేశాడాయన.

సింహ విక్రముడాయన.

మేరునగధీరుడు. అలాంటి వ్యక్తిత్వం అపురూపం.

అటువంటి ప్రజ్ఞ అసాధారణం. అంత సాహసం అనన్య సదృశం.

ప్రజలాయనను ప్రేమించారు, ప్రజలనాయన ప్రేమించినంతగా. ఎదదలుప్పొంగి, ఒళ్లు జలదరించి, తమ ప్రియతమనాయకుడికి ఆంధ్రకేసరి అన్న బిరుదు యిచ్చుకొన్నారు.

ఆయన పుట్టి వంద సంవత్సరాలైంది. వందసంవత్సరాలన్న పరిమితి ఏమిటి? ఆయన పుట్టగానే చిరంజీవి అయినాడు.

ఆయన కీర్తి మాసిపోదు, ఆచంద్రార్కంగా.

1872 ఆగస్టు 23న పుట్టాడు. ఇప్పటి ఒంగోలు జిల్లాలో కనపర్తిలో.

ఒంగోలు జిల్లా కాదది. ప్రకాశం జిల్లా.

కృతజ్ఞతా వినమ్రమైన జాతి పెట్టిన నివాళి ఆయనకు,

మధ్యతరగతి కుటుంబమే అయినా, ఆంధ్ర రాజకీయాకాశంలో మధ్యందిన మార్తాండుడిలా వెలిగాడు.

దుర్నిరీక్ష్యమైన, పరిజలకష్టాలు,

కన్పిళ్ళుచూస్తే. శరత్కాల చంద్రుడే అయిపోయాడు. చిన్ననాడే తండ్రి చనిపోయాడు.

చితికిపోయింది సంసారం. పువ్వులమ్ముకొన్న చోటనే కట్టెలమ్ముకొనవలసి వచ్చింది.

చిన్నవాళ్ళను తీసుకొని పెంచిపెద్దజేసేందుకు తల్లి ఒంగోలు చేరింది.

పూట కూటి ఇల్లు నిర్వహించింది.

అయినా సంసార నిర్వహణం భారమైపోయింది. తల్లి పూటకూళ్ళ ఇల్లు నడిపినా, వారాలు చేసికొని చదువుకోవాల్సి వచ్చింది ప్రకాశం,

మిడిల్ స్కూల్ పరీక్ష ఫీజు మూడు రూపాయలు పుట్టలేదు.

ఒంగోలునుంచి అద్దంకికి పాతిక మైళ్లు.

పెద్దఅక్క మెట్టిన వూరు.

పాతిక మైళ్లు నడిచాడు ప్రకాశం.

కాని మూడు రూపాయలు ఇవ్వలేకపోయినాడు బావ.

మళ్ళీ కాలు సాగించాడు. చేతులూపుకొంటూ ఒంగోలు చేరుకొన్నాడు ప్రకాశం. పట్టు బట్ట కుదవబెట్టి మూడు రూపాయలు తెచ్చి పరీక్షఫీజు చెల్లించి గట్టెక్కించమంది తల్లి.

అలా ఉండేవి చిన్నప్పటి పరిస్థితులు.

చిన్నప్పటినుంచీ హద్దులెరుగని ఉత్సాహమే. ఆకతాయితనమే, చదువుకొనే రోజుల్లో, చిలిపితనమే. రౌడీలతో సావాసాలుండేవి స్కూలురోజుల్లో.

ఎన్నిమార్లో స్కూల్లోంచి డిస్మిస్ మళ్ళీమళ్ళీ చేరడం. అయినా అల్లరి మానక పోవడం,

ఇటువంటి పసితనం. పెరిగి పెద్దయినతరువాత అంతర్ముఖత్వం ఎంత పెరిగింది: తలచుకొంటే ఆశ్చర్యమవుతుంది.

ఈశావాస్యానికి, భగవద్గీతకు, కఠోపనిషత్తుకు సరళ ప్రతిపదార్థ తాత్పర్యాలు రచించాడు.

స్వామీ వివేకానందునితో, ఆధ్యాత్మిక విషయాలను గూర్చి చర్చలుచేశాడు జిజ్ఞాస చూపాడు.

బాలగంగాధర తిలక్‌తో, సుదీర్ఘంగా ప్రాచీన సంస్కృతిని గూర్చి సనాతన సంప్రదాయాలను గూర్చి వాదోపవాదాలు చేశాడు.

ఆయన స్వీయ చరిత్ర 'నా జీవితయాత్ర'.

తెలుగులో చాలామంచి పుస్తకాలలో ఒకటి.

కండగల కమ్మని తెలుగు పలుకుబడి. పరమాద్భుతమైన సన్నివేశాలు. నిరుపమానసాహసం. అఖండమైన త్యాగం. ఇంగ్లండ్ ప్రయాణం బారిస్టర్ చదువు అఖిలభారతీయ కాంగ్రెసు సంస్థాపక సభ్యులతో సాన్నిహిత్యం. దాదాభాయి నౌరోజీ. డబ్ల్యు. సి. బెనర్జీ శ్యాంజీ కృష్ణశర్మలతో తొలినాళ్ళ కాంగ్రెస్ కార్యకలాపాలలో పాల్గొనడం ఆత్మగౌరవ భంగకరమైన సన్నివేశాలతో ఎప్పుడూ రాజీ కుదరలేదు. వాళ్ళు ఎంత గొప్పవాళ్ళైనాసరే. ఆత్మస్వాతంత్ర్య విషయముగా. ఎదిరించవలసివస్తే ఎదిరించాడు. జీవితంలో ఎక్కడైనా, ఎన్నడైనా, ఎప్పుడైనా ఇదే వ్యక్తిత్వం. పద్నాలుగేళ్ళు హైకోర్టులో ప్రాక్టిస్ చేశాడు. అటు తిరుచినాపల్లి నుంచి ఇటు విశాఖపట్నం వరకూ. ఆయన హాజరు గాని కోర్టు లేదు. లక్షలకు లక్షలు ద్రవ్యం సంపాదించాడు ఊటీలో, మద్రాసులో, ఒంగోలులో, రాజమండ్రిలో ఇళ్ళుకట్టాడు. 'లా టైమ్స్' నడిపాడు. నిర్భయంగా కొరడాలతో కొట్టినట్లు వ్రాసేవాడు అందులో. జడ్జీలకు పీ డర్లకు బెదురుగా ఉండేది.

బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశంలో పర్యటనకు వచ్చిన రోజుల్లో, వందేమాతరం ఝంఝూమారుతం ప్రచండంగా వీస్తున్న రోజుల్లో, మద్రాసు మహానగరంలో బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలివ్వడానికి, బహిరంగ సమావేశాలకు అధ్యక్షత వహించే నాథుడే లేకపోయినాడు. నేనున్నానన్నాడు. ప్రకాశం. మద్రాసు బీచి ఒడ్డున బహిరంగ సభకు ప్రకాశమే అధ్యక్షుడు. ప్రభుత్వం తీవ్రమైన ఆక్షేపణలు తెలియజేసింది. అయినా ప్రకాశం జంకలేదు. బిపిన్ చంద్రపాలే ఎందుకీ బెడద అని లొంగుబాటు ప్రవృత్తి చూపాడు.

కాని ప్రకాశం ఏమన్నాట్ట! నీకేం ఫరవాలేదు, నేనున్నా పదమన్నాడు కాని ఆయన ధైర్యం చూపలేదు. ఇదే ప్రకాశం సాహసం.

'స్వరాజ్య' పత్రిక భారతీయ పత్రికా నిర్వహణ చరిత్రలోనే ఉజ్జ్వలాధ్యాయం గాంధీజీ శాంతి సమర శంఖారావం వినగానే దక్షిణాదిన వృత్తిని విసర్జించి, సత్యాగ్రహంలో పాల్గొన్న మహా యోధుడు, మొదటి మహావీరుడు ప్రకాశం. ఎన్నికల ధనమూ చాలిందికాదు. బర్మా, సిలోన్, ఇండొనీషియా, సయాం, దేశాలు, పర్యటించాడు. వేలకువేలు పోగుచేశాడు. ఎంత డబ్బూ చాలిందికాదు. స్వరాజ్యయజ్ఞానికే ఆజ్యధార అయిపోయింది.

ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించాడు. తాను సూత్రధారిగా సత్యాగ్రహాన్ని సాగించాడు. అందరికన్నా ముందు జైలుకు పోయేవాడు. అందరికన్నా వెనుక విడుదలయ్యేవాడు.

ఆంధ్రత్వం మూర్తీభవించినవాడాయన. మద్రాసు ఆంధ్రుల దేనని ఎంతో పటుదలతో వాదించాడు. విత్తమంతా హారతి కర్పూరంలా హరించి పోయినా, ఏమాత్రం కలత పడలేదు. ఇంకాఇంకా ప్రజల హృదయాలలో సన్నిహితంగా ప్రతిష్ఠితుడైనాడు.

ప్రకాశంపంతులు గొప్ప సంస్కరణాభిమాని. రాజమహేంద్రవరంలో. మునిసిపల్ రాజకీయాలలో ఆయన చూపిన ప్రజ్ఞ నిరుపమానం. మద్రాసు రాష్ట్రంలోనే అత్యంత ప్రాచీనమైన మునిసిపాలిటీ రాజమహేంద్రవరం. ముప్ఫై సంవత్సరాలకే ఆయన పురపాలక సంఘాధ్యక్షుడైనాడు. పెద్ద పెద్ద తలలతో ఢీకొన్నాడు. మునిసిపల్ వ్యవహారాలలో ఆయన కనపరచిన చాకచక్యం. అసదృశం.

అఖండ గోదావరిని ఈ వొడ్డునుంచి ఆ వొడ్డుకు అవలీలగా ఈదేవాడు చిన్నతనంలో కాకినాడలో నాటకాలు వేయటం, అప్పటి అల్లర్లు, కక్షలు, ఆవేశాలు అవన్నీ సాహసోపేతమైన వీరగాథలు.

ప్రకాశం పంతులుగారు రాజమహేంద్రవరం చేరటానికి కారకుడు ఇమ్మానేని హనుమంతురావు నాయుడుగారు.

ఆయన అభివృద్ధికి ఆయనే కారకుడు. ఆ విషయాన్ని పంతులుగారే వ్రాసుకొన్నారు.

ప్రకాశం పంతులుగారి జీవితయాత్ర గొప్ప చరిత్రాత్మక గ్రంథం అయన చరిత్రను సృష్టించాడు అప్పటి రాజకీయాలు సాంఘిక సమస్యలు, పల్లెటూళ్ళ సంస్కృతి ఆయన జీవయాత్రలో అడుగడుగునా సాక్షాత్కరిస్తాయి! ఒళ్ళు పులకరింపజేసే సన్నివేశాలవి. ఎనభై అయిదు సంవత్సరాల పరిపూర్ణ జీవితం గడిపాడాయన. సహస్ర మాసాయుష్కుడు. ఆయన దేవతలతో సాటి రాదగ్గ వ్యక్తి, ఎన్నదగినవాడు.

1957 మే 20న స్వర్గస్థుడైనాడు.

అధునిక తెలుగుదేశపు చరిత్రలో ఆయన జీవితం పరమాద్భుత సన్నివేశం. తెలుగువాళ్ళ కీర్తి ప్రతిష్ఠలకు ఆయన ఆకారం. తెలుగువాళ్ల సాహసౌదార్యాలకు ఆయన పతాకం.

సహస్ర దళ పద్మంవంటి దాయన బహుముఖ ప్రతిభాశాలిత్వం. మెరుపులోని ఆకర్షణ, సింహసహజమైన పరాక్రమం ఆయన జీవితంలో కనబడతాయి. పూర్ణపురుషుడాయన. ప్రకాశమంటే ప్రజే. ప్రజే ప్రకాశం అన్న తాదాత్మ్యం, అవినాభావం, ఆయన కీర్తి. ఆయన మూర్తిత్వం.

స్కూల్లో చదువుకొంటున్నా. నాటకాలలో వేషాలువేస్తున్నా మునిసిపల్ రాజకీయాలలో చక్రం తిప్పినా, రాజకీయాలలో సారథ్యం వహిస్తున్నా మంత్రిపదవిని నిర్వహిస్తున్నా అన్యాయాల నెదుర్కొంటున్నా. ప్రకాశం ప్రకాశం లాగానే ప్రవర్తించాడు. ఆయన కాయన మాత్రమే ఉపమానం. ఆయన జీవిత మంతా అద్భుత రసప్రధానం.

# సత్యాహింసల సాధనలోని మర్మము

యఱ్ఱమిల్లి చలపతిరావు శ్రీవత్సవ

సత్యమును గురించీ, అహింసను గురించీ, వ్యాఖ్యానేయుట సాధ్యమా? అని కొందరి ప్రశ్న. కోమల పుష్పములను చేర్చి మాలగా కట్టునపుడు అవి ఏ విధంగా వాడిపోవునో, వ్యాఖ్యానేయుటకు ప్రయత్నించినప్పుడు అహింస కూడా వాడి పోవును. నిజమునకు అహింసను గూర్చిగాని, సత్యమును గూర్చిగాని వ్యాఖ్యసేయుట అవసరము కాదు. వ్యాఖ్యకు మూలమున ఎల్లప్పుడూ సత్యముండి తీరును. ఏ వ్యాఖ్యయైననూ సత్యమను ఒరపిడి రాయిపై పెట్టి పరీక్షించి చూడబడును. కాని సత్యమునుగూర్చి వ్యాఖ్యసేయునపుడు దానిని ఏ గీటు రాయిపై గీసి చూడవలయును? కాబట్టి సత్యమును గూర్చి, అహింసను గూర్చి వ్యాఖ్యసేయ జాలము.

సత్యాగ్రహ శబ్దమును గాంధీజీ ప్రయోగించుట చేత అది పావనమయ్యెను. కాని గాంధీజీ అనంతరము దానిని దురుపయోగము చేయుట వలన అది దూష్యమై పోయినది. మూలతః సత్యము పావన శబ్దము. ఆగ్రహము అనగా క్రోధము అని అర్థము. కాని గాంధీజీ ద్వారా అది ప్రయోగము చేయబడినందున అది పావనమైనది.

## సత్యగ్రాహి

ఇప్పుడు మనమూ ఒక కొత్త శబ్దమును తయారు చేయవలసి యున్నది. అది సత్యగ్రాహి అని. సత్యాగ్రహి అగుటకు పూర్వము, మనము సత్యగ్రాహులము కావలసి యున్నది. లేనిచో మనము సత్యాగ్రాహులము కాజాలము. మన పక్షములో సత్యము ఉన్నదని భావించి మనము మన వ్యవహారములను కార్యోన్ముఖ మొనరింతము. కాని ఎదుటి వానిలో గూడ ఎంతో కొంత సత్యమున్నదని గుర్తించి దానిని గ్రహించక పోయినచో మనము ఎదుటి వాని హృదయములో ప్రవేశమును పొందజాలము. హృదయ పరివర్తనము జరుగనిదే హృదయములో ప్రవేశించుట సాధ్యము కాదు. కాబట్టి ఎదుటి వ్యక్తిలో గల సత్యమును వెంటనే మనము స్వీకరించినచో, అతనిలో గల అసత్యాంశము దానంతట అదియే కరిగి పోవును. అట్లు కానిచో అతని వద్దనున్న సత్యము వలన అతనిలో నున్న అసత్యమును గూడ బలవత్తరము కాగలదు. అనగా, అతని సత్యాంశము అతని అసత్యమునకు సహేతు వగును. ఇందు కొరకు ఈ సందర్భములో ఒక చిన్న ఉపమానము అవసరమని నా అభిప్రాయము.



## "సహేంద్ర తక్షకాయ స్వాహా"

తక్షక సర్పమును అగ్నిలో ఆహుతి చేయవలసియుండెను. అతని బాధ నుండి దేవతలను విముక్తులను చేయుటకు ఆ విధముగ చేయుట అవసరమయ్యెను. కాని ఆ తక్షకుడు ఇంద్రుని ఆశ్రయమును చేరి అతని సింహాసనమునకు చుట్టుకొనెను. అప్పుడు ఋషులు, సహేంద్ర తక్షకాయ స్వాహా అని జపించినప్పటికీ, ఫలితము ఏమైనది? ఇంద్రుడు అమరుడు అగుటచేత అగ్నికి ఆహుతి యగువాడు కాడు. కాబట్టి తక్షకుడు కూడ అమరుడై పోయెను. ఋషులు కొంచెము ఇంద్రుని ఆశ్రయమునుండి తక్షకుని తొలగించినచో అతడు అగ్నికి ఆహుతి అయ్యెడువాడు. కాని ఇంద్రునితో సహా తక్షకుని ఆహుతి చేయుటవలన చచ్చిపోవలసిన తక్షకుడు కూడ చావు లేనివాడయ్యెను. కాబట్టి ఎదుటి వ్యక్తిలోనున్న సత్యాంశమును ముందుగానే మనము స్వీకరించుట అవసరము మన పక్షమున నున్న సత్యాంశము వలన మన దృష్టి, ఎదుటి వ్యక్తిలో గల సత్యమును—వస్తుస్థితిని చూడజాలనంత గుడ్డిగా తయారు కారాదు. ఈ ప్రక్రియ అంతయూ శాంకర చింతనకు సంబంధించినది. సత్యాగ్రహి యగువాడు ఎట్టి పరిస్థితిలో నూతన చిత్త శాంతిని, అక్షోభమును పోగొట్టుకొనరాదు. ఇదియే సత్యాగ్రహికి గల ముఖ్యమైన బలము.

హింసా విధానములో నడచు ప్రక్రియకు వ్యతిరేకమైన ప్రక్రియ అహింసా విధానములో నడచుచుండును. హింసా పద్ధతిలో మొదట సంభాషణ, తరువాత ఒడంబడిక, అది కుదరనిచో బహిష్కరణ, అది గూడ సాగనిచో పోరాటము సంభవించుచుండును. అనగా మొదట సౌమ్యము, తరువాత తీవ్రము, అటు పిమ్మట తీవ్రతరము అయిన కార్యక్రమము జరుగును. కాని అహింసా విధానములో మొదటి ప్రయోగము సౌమ్యము. అది సఫలముగానిచో తరువాత ప్రయోగము సౌమ్యతరము. అది కూడ సఫలము గానిచో పిమ్మట ప్రయోగము సౌమ్యతమము కాగలదు, హోమియోపతీ వైద్య విధానములో ఇట్లే జరుగును. పంచదార పరిమితి పెంచుకొనుచూ పోయి, మందు పరిమాణము తగ్గించుకొనుచూ పోయినచో దాని శక్తి (పొటిన్సీ) పెరుగుచుండును. అట్లే మన ప్రక్రియ గూడ ఉత్తరోత్తరా సౌమ్యము, సౌమ్యతరము. సౌమ్యతమమూ అగుచూ పోయినచో, దానికి ఫలితము అధికముగా కనిపించగలదు. ఉగ్రము, ఉగ్రతరము, ఉగ్రతమమూ అయినచో అట్టి సత్ఫలితములను ఎంత మాత్రమూ సాధింపజాలదు. అట్లయినచో అది స్పష్టముగ హింసా ప్రక్రియ యగును. హింసా ప్రక్రియనే అహింస గూడ అవలంబించినచో, అది హింసకు ఆశ్రయము కల్పించినదగును.

ఈ నాటి పరిస్థితులలో రెండు వర్గముల మధ్య పరస్పర అవిశ్వాసము నెలకొని యున్నది. దీనిని తొలగించుటయే నేడు విద్యావంతుల విధియై యున్నది. గ్రామ దానములో ఇటువంటి అహింసా ప్రక్రియయే అమలు జరుప బడుచున్నదా? అని మరొక ప్రశ్న. ఈ ప్రక్రియ ననుసరించియే గ్రామదాన ఉద్యమము గూడ నడుపబడుచున్నది. ఎవరైన వ్యక్తి గ్రామదాన ఉద్యమమును అర్థము చేసికొనలేక పోయినచో అతడు దానిని అర్థము చేసుకొను నంత వరకూ అట్లే వదలి వేయవలెను. గ్రామదాన గ్రామములో నూటికి పాతిక మంది అర్థముచేసికొనలేక పోయినచో వారిపై ఏ విధమైన ఒత్తిడియూ తీసుకొని రాబడదు. ప్రత్యక్ష దర్శనము వలన వారు తమ సందేహమును నివృత్తి చేసుకొన గలిగినప్పుడు, తాము కేవలము ప్రతి పక్షుల హితమునే గాక తమ హితమును గూడ ఆలోచించినామని వారు గ్రహించ గలరు. ఇదే మహాత్ముని సర్వోదయ సిద్ధాంతమునకు మూలము. వారికి నచ్చునట్లు చేయుటయే గాని ఏదో విధముగా వ్యవహారమును నడుపుకొని పోవుట సర్వోదయ సిద్ధాంతము యొక్క లక్ష్యము కాదు. ఇదియే సత్యా హింసల సాధనకు అనుకూలమగు సౌమ్య, సౌమ్యతర, సౌమ్యతమ ప్రక్రియ.

---

# గాంధీ ఋషి

దేవపల్లి సత్యారావు



సత్యమేజీవితాధార శక్తిగాగ
నిత్యమారాధనముఁజేసి నిగమచోది
తార్థమాత్మానుభూతిగా నలరినాడ
వేమి నీపుణ్య ఫలము! గాంధీ! మహాత్మ!

బ్రహ్మచర్యంబులోని ప్రభావమెల్ల
స్వానుభవమున గుర్తించి, జగతికెల్ల
దాని పటిమను బోధింపఁ బూనినావు
ధీరవందిత చరిత! గాంధీ! మహాత్మ!

నిత్య శుచితయు మౌనంబు, నియమ గరిమ
దయయుఁ, ద్యాగంబు సహజ తత్త్వములు నీకు;
నహహ! యీ గుణంబులె తపంబగు నటంచుఁ
దెలుపుదురు గాదె బుధులు? గాంధీ! మహాత్మ!

నీ సత్యాగ్రహమున్, మనో విజయమున్ నీ భక్తి
సాంద్రత్వమున్
నీ సౌజన్యము, నీదు భూతదయయున్, నీయోగ
సంపత్తియున్
నీ సేవారతియున్ నుతింపవశమే? నీ దర్శనంబబ్బుటన్
దోసంబుల్ నశియించి మాకొదవె సంతోసంబు
గాంధిప్రభూ!

భారతదేశదాస్యమును బాపి, ప్రజల్ సుఖియింపఁ బెంపుఁజే
కూరుపఁ గోరి, జీవితముఁ గూడఁ దపంబున వృద్ధిచేసి సం
సార సుఖంబులొల్లకయె సత్య మహింసయు నస్త్రరాజిగాఁ
బోరితి వౌర! శాంతిరణమున్, జగమెల్ల వడంకనో ఋషీ!

రామరాజ్యమందు ప్రజలెట్లు సౌఖ్యంబుఁ
బడసినారొ మున్ను భరతభూమి
నట్లె ప్రజలఁ బ్రోవ నాత్మలో దీక్షించి
శ్రమలనొందినాడ విమల చరిత!

రాజకీయములలో బ్రహ్మణ్యుఁడ వటంచు
వ్యవహారదక్షులు ప్రస్తుతింపఁ,
బ్రకృతిన్ జయించిన బ్రహ్మవేత్తవటంచు
నాత్మవేత్తలుకొని యాడుచుండ,
భక్తి రాజ్యంబేలు పావనాత్ముఁడవంచు
ననిశంబు నిను భక్తు లనుసరింప,
అతిలోకగుణరాశి వని దేశదేశాల
ప్రజనిన్నుఁ దలపోసి ప్రణతులొసఁగఁ

గృష్ణపరమాత్మఁ బోలుయోగీశ్వరుండ
వగుచుఁ జెలఁగిన నీ తత్త్వ మరయఁ దరమె
మమ్ముఁ బోంట్లకుఁ? గాననా మానసమున
దేవునిగ నిన్నుఁ దలతు గాంధీ! మహాత్మ!

తలఁపున్, మాటయుఁ జేఁతయున్ బరమసత్యస్ఫూర్తితో
నిత్యమున్
బొలుపున్ జెందఁ ద్రిశుద్ధిగల్గి కరుణాంభోరాశివై దేశమున్
గొలువన్ సాగిన కర్మవీరుఁడవు నీకున్ సాటిలేరెందు, నీ
పలుకుల్ మాకును వేదవాక్యములు విశ్వస్తుత్యసత్యవ్రతా!

విప్లవోద్రేక భావమ్ము ప్రేమభావ
మక్క జగముగ సమ్మేళన మయివెలుంగ
జగతిఁ బ్రజనెల్ల బంధుకోటిగ గణించు
దివ్యకారుణ్యమతివి గాంధీ మహాత్మ!

ఉపనిషత్సారమైనట్టి యోగశాస్త్ర
మేది జగతికి శరణమై యెసఁగునెపుడుఁ
దానిఁ గైకొని జీవితాదర్శముగ కృ
తార్థతన్ జెందినావుగదా! మహాత్మ!

మునుల నివాసమౌ భరత భూమిని బుట్టియుఁ గూడ దైవచిం
తనవిముఖత్వమొందుచు నధర్మకుతర్కము సల్పువారికిన్
మనసుకరంగుభంగిఁ బర మాత్ముని లీలల బోధసేసి నూ
తనరుచి భక్తిరాజ్యము నితాంతము నిల్పితివో ఋషీశ్వరా!

అరిషడ్వర్గముఁ గెల్చి, యింద్రియమనో వ్యాపారముల్ నిల్పి భా
సుర దివ్యత్వము నొంది, భారత నివాసుల్ బొందు
కష్టంబులన్
దరలన్ జేయఁగ నాత్మశక్తిఁ బ్రజకాధారంబుగా నిద్దనిన్
గురుదేవుండని మ్రొక్కకుండఁ గలరొక్కో! దేశ దేశ
ప్రజల్!



# మనమూ మనదేశం మన జనాభా



ముద్దసాని రాంరెడ్డి

సృష్టి, స్థితి, లయములు పరమేశ్వర లీలలు. పరమాత్ముని ఆజ్ఞానుసారమే అండ పిండ బ్రహ్మాండాదులు తమ విధి నిర్వహణోద్యోగ ధర్మంలో నిమగ్నమై యున్నవి. పరమేశ్వర సృష్టిలో మానవుడు నిమిత్త మాత్రుడై తన విధిని నిర్వర్తిస్తున్నా, తన కొరకు, తన వారి కొరకు, తన సుఖం కొరకు తాపత్రయ పడుతున్న విషయాన్ని మాత్రం కాదనలేము. దేవుడు ప్రసాదించిన బుద్ధి కుశలత నుపయోగించి, కష్టాలను కడకునెట్టి, సుఖ సంతోషాల కొరకు చేయవలసిందంతా చేస్తూ, ప్రపంచాన్ని నందనవనంగా తీర్చి దిద్దడానికి అహరహమూ శ్రమిస్తున్నాడు దేవుడి అస్తిత్వాన్ని అంగీకరిస్తూనే, "అహం బ్రహ్మాస్మి" అను నంతటి శక్తియుక్తులను సముపార్జించుకున్న నరోత్తముడు. చరిత్ర గతినే మార్చ సంకల్పించిన పురుషోత్తముడు. సృష్టి రహస్యాలను ఛేదించ సమకట్టిన పురుష పుంగవుడు వైయక్తిక సుఖ సంతోషాల కొరకు తన కుటుంబాన్ని పరిమితం చేసికొనుట సహజమే!

## జనాభా పెరుగుదల

గత రెండు దశాబ్దాల నుండి భారతదేశ జనాభా ఇరవై శాతం పెరిగింది దీనివల్ల మన ప్రణాళికలు, ఆర్థిక వనరులు, సహజసంపదలు జాతీయ జీవనాన్ని పెంపొందించ లేక పోతున్నవి. దేశ ప్రగతితో పాటు పౌరుని సంఘజీవితం, ఆరోగ్యం, ఆనందం, ఆర్థిక సౌభాగ్యం క్షీణించి జాతి పురోభివృద్ధికి అవరోధం కలుగుతున్నది. యీ నాడు ప్రపంచ జనాభాలో భారతదేశం ద్వితీయశ్రేణిలోను భౌగోళిక విస్తీర్ణం రీత్యా ఏడవ స్థానంలోనూ ఉన్నది భారతదేశ జనాభా అమెరికా కంటె $2\frac{1}{2}$ అంతలు, ఆస్ట్రేలియా కంటె నలుభైయ్యంతలు, కెనడాకంటె ఇరువై నాలుగింతలు, జపాను పాకిస్తానుల కంటె ఆరంతలు అధిక జనాభాతో వర్ధిల్లుతున్నది. చైనాతో పోల్చి చూస్తే యీ శాతం మూడింట రెండు వంతుల నిష్పత్తిలో ఉన్నది. 1971 జనాభా లెక్కల ప్రకారం మన దేశ జనాభా 54,69,55,945 కోట్లు ఉన్నది ప్రతి సెకనుకొక శిశువు భరత ఖండంలో ఉద్భవిస్తూ, ఇరవై నాలుగు గంటల్లో 55 వేల నధిగమించి, సంవత్సరానికి 210 లక్షలను చేరుకుంటున్నది. అనగా ఉత్పత్తి శాతం ప్రతివేయి జనంలో 41 ఉండగా మరణ శాతం 16 ను మించుటలేదు. సంవత్సరానికి సగటున 80 లక్షలు చచ్చినా, 130 లక్షలు ప్రతి వత్సరం ప్రవర్ధమాన మవుతున్నారని అనడానికి బదులు సంవత్సరానికొక హాలెండ్ లేదా ఆస్ట్రేలియా ఖండపు జనాభా పెరుగుతుందని అంటే హృదయానికి హత్తుకుంటుంది. ప్రతి వసంతానికి దేశంలో 130 లక్షల చొప్పున పెరుగుతున్న మానవాళికి 120 లక్షల క్వింటాళ్ల ఆహార ధాన్యాలు, 1880 లక్షల మీటర్ల గుడ్డ, 20 లక్షల ఇండ్లు, 126 వేల విద్యాలయాలు, 372 వేల ఉపాధ్యాయులు, 40 లక్షల ఉద్యోగాల అవసరం ఏర్పడుతుంది. ఇంతలేసి ప్రగతిని ప్రతి సంవత్సరం సాధించడం అభివృద్ధి చెందుతున్న భారతావనికి తలకు మించిన భారంగా ఉంటుందని వేరుగా చెప్పాలా? స్వాతంత్ర్య సముపార్జనకు పూర్వం భారత దేశ ఆర్థికాభివృద్ధి ఒక శాతానికి మించిలేదు. కాని యీ నాడది 3.8 శాతాన్నతిక్రమించింది. అలాగే పారిశ్రామికాభివృద్ధి 150 శాతం, ఆహారోత్పత్తి 62 శాతం పెరిగినా, అధిక జననాల పెరుగుదుల కారణంగా, మనకు సగటున 12.4 ఔన్సుల ఆహారం కూడ లభించడం లేదు. విద్యా బోధనావకాశాలు 1947 నాటి కంటె మూడింతలధికమైనా, ఇంకా 630 లక్షల బాలబాలికలు పాఠశాలలకు బయటనే ఉండవలసి వస్తున్నది. ఒక కోటి యువతరానికి ఉద్యోగాలు దొరకడం లేదు. దీనికి తోడు ప్రతివత్సరం లక్ష పట్టభద్రులు నిరుద్యోగుల జాబితాలో చేరిపోతున్నారు. ఇక ఆహారధాన్యాల ధరలు నిత్యావసర వస్తువుల ధరలు దినదినం తారాపథాన్నంటు తున్నవి. ప్రస్తుత అంచనాల ననుసరించి 74,100,000 గృహాలు నగరాల్లోను, గ్రామాల్లోనూ, అవసరంగా నిర్మించవలసివుంది. క్షణం క్షణం పెరుగుతున్న జనానికి వార్షిక ప్రణాళికలు పనికిరాక ఆర్థిక స్థితి అస్తవ్యస్తమవుతూ దేశ భవితవ్యానికొక సవాలుగా పరిణమించింది. ప్రణాళికా పథకాలు కుంటుపడకుండా సాగడానికిగాను పరిమిత కుటుంబ ప్రణాళికలు కూడా అంచనాల నధిగమించకుండా చూడాలి.

## పంచ సూత్రాలు

జనాభా పెరుగుదల ఒత్తిడిని తట్టుకోడానికి క్రింద వివరింపబడిన పంచ సూత్రముల నాచరణయందుంచాల్సి ఉంటుంది. (1) అధునాతన పద్ధతులద్వారా వ్యవసాయాభివృద్ధి, (2) విస్తృత ప్రాతిపదికపై పారిశ్రామీకరణ, (3) జన బాహుళ్యం లేని రాష్ట్రాలకు ప్రజల వలస, (4) విదేశాలకు నివాసార్థం ప్రజల తరలింపు, (5) యుద్ధప్రాతిపదికపై కుటుంబ నియంత్రణ యొక్క అమలు. భారత దేశం సర్వతోముఖాభివృద్ధి నందుటకు, శ్రేయోరాజ్యంగా రూపొందుటకు, కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను ఉద్ధృతం

(తరువాయి 42వ పుటలో)

# ఘంటసాల

పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు

"కంటకసాల, కంటకసోల, కంటకసేల, కంటకశైల, కొంటకశైల" అను పెక్కు పేర్లతో ఒకనాడు వ్యవహరించబడింది నేటి ఘంటసాల. అది ఆంధ్ర బౌద్ధ స్వర్ణయుగభాగోదయానికి వునికి పట్టై, ప్రముఖ వాణిజ్య కేంద్రమై, దేశాంతర, ఖండాంతర ఖ్యాతి నార్జించిన మహా పట్టణం. దీనికి 'గజరాజపురం' అను వేరొక పేరు గూడా వుండేది.

ఘంటసాల కృష్ణామండలంలోని దివి తాలూకాలో వున్న ప్రాచీన ప్రసిద్ధ గ్రామం. ఇది బందరు పట్టణానికి పడమటి దిక్కున పదిహేను మైళ్ళ దూరంలో వుంది. ప్రథమాంధ్ర రాజులకు రాజధానీ నగరమై భోగభాగ్యాలతో తులతూగిన 'శ్రీకాకుళ మహాక్షేత్రం' దీనికి తూర్పున ఆరు మైళ్ళ దూరంలో కృష్ణానది ఒడ్డున వుంది.

ఘంటసాల గ్రామప్రదేశమంతాపాటినేల రెండు మైళ్ల పొడవూ, ఒక మైలు వెడల్పూ గల యీ ప్రదేశాన్ని, ఎక్కడ త్రవ్వినా, ఏ రాయి కదిలించి చూచినా పురాతన కాలపు శిథిలమైన కట్టడాల పునాదులతోను, కనుమరుగై పోయి భూగర్భంలో దాగిన అపురూపవస్తు సముదాయంతోనూ, శిలా శిల్పచిత్రాలతోను నిండి వుండి, అది తన ప్రాచీన చారిత్రిక విశిష్టతను, ఘనతను వేనోళ్ల చాటి చెపుతూవుంది.

ఆంధ్రదేశానికి, ఆంధ్రప్రజలకు ఖండాంతర వర్తక వ్యాపారంతో అపారధనరాసులను పోగుచేసి పెట్టిన ప్రాచీన ఓడ రేవులలో పేర్కొనదగినవి మోటుపల్లి 'ఘంటసాల,' గూడూరు మాత్రమే.

మహా సాహసికులైన ఆనాటి మన బౌద్ధ-భిక్షులు, జావా, సుమత్రా, బోర్నియో, సింహళం, గ్రీసు, రోమ్ ఈజిప్టు, చీనా, బర్మా, తాయిలెండు మొదలైన విదేశాలలో ప్రముఖ వ్యాపారాలు చేసి వుండిరి. రోమను చరిత్రకారులు గూడా యీసత్యాన్ని బలపరుస్తూ పెక్కు వ్రాతలు వ్రాశారు. దీనికి తార్కాణంగా, యీ ఘంటసాల యందూ, పరిసర ప్రదేశాలందూ, రోమను నాణేలు ఎన్నో లభించాయి. అంతేగాక యిక్కడ దొరికిన ఎన్నో నాణేల పైన ఓడ, తెరచాపలు గూడా ముద్రింపబడి వున్నాయి.

పై అంశాలను బట్టేగాక, ఇక్కడ వున్న ప్రాచీన కాలపు బౌద్ధస్తూపాన్ని బట్టి, జలధీశ్వరస్వామి వారి ఆలయాన్ని బట్టి ఇది ఒక ప్రాచీన ఓడ రేవని మనం నిస్సందేహంగా గుర్తించవచ్చు. శుభ కార్యాలను నిర్వహించే సందర్భాలలో దేవతలను పూజించి వారి అనుగ్రహాన్ని పొందే ఆచారం అనాది నుండి పరంపరగా వస్తూ వున్నదేగదా! ఆనాటి ధీరులు మహాసాహసికులు ఐన వణిజులు, నావికులు అపార సముద్రంపైన, ధనరాసులను పోగుచేసే

నిమిత్తం. ప్రాణాపాయకరమైన సాహసయాత్రలు చేసే సందర్భాలలో యీ దేవదేవుని పూజిస్తూ వుండేవారేమో! కనుకనే వారు యీ స్వామిని 'జలధీశ్వర' అనే విచిత్ర నామంతో ఆరాధించి వుండేవారు గాబోలు! దీనిని బట్టి యిది ఒక ప్రాచీన ఓడ రేవని మనకు నిస్సంశయంగా తెలియగలదు.

గ్రీకు భూగోళశాస్త్రజ్ఞుడు 'టోలామి' క్రీ.శ. 140 సంవత్సర ప్రాంతంలో హిందూదేశంలో వున్న ఓడ రేవులను పేర్కొంటూ, కృష్ణా తీరాన వున్న మైసోలియాను, ఆ నది ముఖద్వారాన వున్న కొంటకశైలల, గుడ్డూరులను గురించి వివరించాడు.

నేడు కొంటకశైల కృష్ణా నదికి సమీపాన లేకపోయినా, ఒకప్పుడు ఆ పరివాహం దీని నానుకొని ప్రవహించి వుండవచ్చును కాలగతిలో యిట్టి వింతలు ఎన్ని సంభవించటం లేదు! ఇది గూడ అట్టి వింతలలో ఒకటేమో! ఎవరు చెప్పగలరు?

సిద్ధార్థుడు మానవాళి దుఃఖోపశమనార్థం అర్ధరాత్రి తన అనుగు భార్యను, ముద్దుల కుమారుణ్ణి, కన్నతల్లిదండ్రుల్ని, సమస్త భోగభాగ్యాల్ని సమకూర్చగలిగిన రాజ్యాన్ని పరిత్యజించి 'కంటకం' అను పేరుగల ధవళాశ్వాన్ని ఎక్కి అరణ్యాలకు పోయినాడు. ఆ పిమ్మట ఆ త్యాగధనుడు తాను అధిరోహించిన ఆ గుర్రాన్ని గూడా విడిచిపెట్టి అరణ్యాలలో జ్ఞానోపార్జనకు బయలుదేరాడు ఆ కంటకం తన యజమానియందు భక్తి విశ్వాసాలతో నిద్రాహారాలు మాని చిక్కి శల్యమై మరణించింది

ఆ పరమ కారుణ్యమూర్తి, అహింసా మహా వ్రతనిష్ఠా గరిష్ఠుడు అయిన శాక్యమునిని లోకకల్యాణార్థం అరణ్యాలకు గొంపోయి, ఆ మహా మహుని మహాభినిష్క్రమణంతో మిక్కిలి దుఃఖించి ఆత్మత్యాగం సలిపిన ఆ దివ్య ధవళాశ్వం పేరు శాశ్వతంగా లోకంలో వర్ధిల్లి వుండేట్లు కళాగ్రగణ్యులైన ఆ నాటి మన బౌద్ధాంధ్రులు ఒక విహారాన్ని నిర్మించి దానికి కంటకశైల మనే పవిత్ర నామం పెట్టివుండిరి గాబోలు. కాలక్రమమున ఉచ్చారణ సామ్యంవల్ల పైన తెలిపిన భిన్ననామాలతో అది వ్యవహరింపబడి నేడు ఘంటసాలగా నిలిచింది.

బౌద్ధయుగంలో 'కంటకసేల' లేక 'కంటకశైల' అని ప్రసిద్ధిపొంది ప్రముఖ వాణిజ్య కేంద్రమై గొప్ప ఓడరేవై జిజ్ఞాసువులకు మహా పవిత్ర స్థానమై బౌద్ధులకు యాత్రాస్థలమై దేశదేశ ప్రజలకు విజ్ఞాన భిక్ష పెట్టిన యీ మహా పట్టణం కాలక్రమాన ఘంటసాలగా యెప్పుడు ఎట్లా మారిందో తెలియ జేయటం చాలా కష్టం. నేడు వాడుకలో దీనికి సంబంధించివున్న ఒక ఇతిహాసాన్ని యిచ్చట తెలుపటం సమంజసమని భావిస్తున్నాను.

కంటకసేల ప్రాంతాన గొప్ప కాటకం సంభవించిందట. ఆ ప్రాంతాన్ని పాలించే రాజు వేటకై సమీపారణ్యాలకు పోయెనట! అక్కడ ఒక చెట్టుక్రింద పసిబాలుడు ఏడుస్తూ వుండటం చూచి దయామయుడైన ఆ ప్రభువు ఆ పసి కందును తన ఇంటికి తీసుకొనివచ్చి తన భార్యకిచ్చాడట. సంతానహీనురాలైన ఆ రాణి ఆ పిల వాణ్ణి అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసింది.

కొంతకాలానికి రాజు మరణించాడు. యుక్తవయస్కుడైన ఆ బాలుణ్ణి మంత్రులు గద్దె నెక్కించారు. అతడు మంత్రుల వలన తన జన్మకు సంబంధించిన పూర్వ కథను విని, తన తల్లిదండ్రులెవరో తెలుసుకొనగోరాడు. గ్రామానికి ఉత్తర దిక్కున ఉన్న గోటకంలో ఒక అన్న సత్రం ఏర్పాటుచేసి వచ్చినవారికెల్లా ఉచితంగా భోజనంపెట్టించి వారి వారి వృత్తాంతాలను తెలుసుకోనారంభించాడు. ఆ సత్రం దగ్గర ఒక పెద్ద ఘంటను కట్టించి, భోజనం సిద్ధం కాగానే దానిని మ్రోగించెడివారట. అది మిక్కిలి దూరంవరకు వినిపిస్తూ ఉండేదట. ఆ ఘంటారావమును విని ప్రజలు జనానికి వస్తూ వుండేవారు. ఆ ఘంట నుంచిన 'సాల' ప్రదేశమును ప్రజలు క్రమంగా 'ఘంటసాల' అని వ్యవహరింప మొదలిడిరి.

పైన తెలిపిన కథనే ప్రజలు మరియొక విధంగా గూడా తెలుపుతూ వుంటారు. అది ఇది—

ఆ బాలరాజు సింహాసనం అధిష్ఠించి దిగ్విజయ యాత్రలు చేసి చక్రవర్తి అయ్యాడు. మంత్రులవల్ల తన జన్మ వృత్తాంతాన్ని తెలుసుకొని తాను దొరికిన ప్రదేశంలో ఒక అన్న సత్రం యేర్పాటు చేయించి అక్కడ ఒక ఘంటను వ్రేలాడ గట్టించాడు. అహో రాత్రాలు నిర్విరామంగా ఆ ఘంట మ్రోగుతూ వుండేదట. దానిని మ్రోగించినవారికెల్లా భోజనం పెట్టిస్తూ వుండేవాడట ఆ చక్రవర్తి.

అక్కడవున్న ఆ గ్రామానికి 'సేల' అను పేరుతో క్రమంగా 'ఘంటసాల' అను నామము స్థిరపడిపోయినదట. చారిత్రికాధార రహితమైన యీ కట్టుకథలు వీనులకు విందు సమకూరుస్తాయేగాని నమ్మటానికి మాత్రం వీలుండదు. ఐనను బౌద్ధయుగాన అఖండ విఖ్యాతిని పొందిన 'కంటకసేల' కాలక్రమాన ఘంటసాలగా మారినదనుట మాత్రం నమ్మదగిన విషయం.

తొమ్మిదవ శతాబ్దివాడైన చాళుక్య విష్ణువర్ధనుడు రెండువేల యిండ్లను బ్రాహ్మణులకు ఘంటసాలలో దానంచేసినట్లు తెలిపే శాసనం జలధీశ్వరస్వామివారి దేవాలయంలో వుంది. అంతేగాక ఈ పట్టణంలో 101 దేవాలయాలు, 101 చెరువులు, 101 నూతులు, ఆ కాలంలో వుండేవట. ఇచ్చటవున్న దేవాలయాలకు యితర ప్రాంతాలలోవున్న భక్తులు భూములు దానంచేసినట్లు తెలుపు శాసనములు పెక్కు లభించాయి. ఆ భూములవల్లవచ్చే ఆదాయంతో నిత్య నైవేద్య కైంకర్యాదులతోపాటు యితర విధాలుగాగూడా తోడ్పాటు జరుగుతూ వుండేదట. నేడు ఆ గ్రామంలోను, పరిసర ప్రాంతాలలోను ఎక్కడ త్రవ్వినా, పెక్కు లింగాలు, విగ్రహాలు, నందులు, పానవట్టాలు, దేవాలయాలకు సంబంధించిన యితర చిహ్నాలు యెన్నో లభిస్తున్నాయి. ఇది పై చారిత్రిక సత్యాన్ని రుజువుచేస్తున్నది.

బౌద్ధ యుగంలో విశ్వ విఖ్యాతి నార్జించిన కంటకసేల, చీనానుండి 'రోం' వరకుగల భిన్న దేశాలలో నివసించు బౌద్ధులకు, పవిత్ర యాత్రా స్థలమై, ప్రధాన వాణిజ్య కేంద్రమై విభిన్న ప్రాంత ప్రజ కలయికకు సంగమ స్థానమై వివిధ వస్తువుల ఎగుమతి దిగుమతులతో, దేదీప్యమానంగా వెలుగొందుతూ, ఆది లక్ష్మీ

దేవికి పుట్టినిల్లై, సరస్వతీదేవికి ఆవాసమై భాసిస్తూ వుండేది. నేడు ఆ ప్రాచీన ప్రఖ్యాత నగరం, బౌద్ధుల శిథిల కట్టడాలకు పురాతన దేవాలయ జీర్ణ చిహ్నాలకు తావలమైవుంది. అచ్చటవున్న పురాతన స్థూపమునుగురించి, తత్రివ్వకాలలో లభించిన యితరవస్తు సముదాయమునుగురించి తెలిసికొనుట మిక్కిలి అవసరం.

ఘంటసాల స్థూపమునుగురించి, అచ్చటగల పురాతన వస్తు సముదాయమునుగురించి వివరాలను సేకరించిన బాస్వెల్ దొరగారు క్రీ. శ. 1870–71 సంవత్సరాలలో ప్రభుత్వానికి ఒక నివేదికను సమర్పించాడు. తత్ఫలితంగా పురాతత్వశాఖ సూపరెంటెండెంటు గారైన అలెగ్జాండరు రే గారు 1906 వ సంవత్సరమున ఘంటసాల గ్రామానికి విచ్చేశారు. స్థానికులచే అనాదరణచేయబడి 'లంజ దిబ్బ' లనే కళంకనామంతో పిలువబడుతూ గ్రామానికి ఈశాన్య దిక్కునగల ఒక చేలో వున్న గుండ్రని ఆకృతిగల ఒక దిబ్బను ఖనన పరిశోధన చేయించాడు. అది ఒక స్థూపమని తేలింది. దాని మధ్య కొలత.పొడవు షుమారు 112 అడుగులు. ఎత్తు 23 అడుగులు. దాని పై భాగమంతా ఇటుక గోడలతోను, పాటిమట్టితోను నిండి వుంది.

ఈ స్థూపం మధ్య పది అడుగుల చచ్చౌకంగల ఇటుకలతో నిర్మించిన గట్టి దిమ్మ వుంది. దాని చుట్టు 19 అడుగుల చచ్చౌకం గల సమ చతురావరణం వుంది. ఆవరణకుగల గోడల మందం 3 అడుగుల 4 అంగుళాలు. మధ్య దిమ్మకు నాలుగు వైపుల 2 అడుగుల 4 అంగుళాల కతెర గోడ వుంది. దీనిని ఆవరణ గోడతో కలిపివేశారు. దీని చుట్టు 3 అడుగుల గుండ్రము, 6 అంగుళాల మందము, 55 అడుగుల 10 అంగుళాల ఉలివెలుపలి మధ్యకొలతగల ఒక ఇటుక గోడ వుంది. పైన తెలిపిన కత్తెర గోడల లోపలవున్న సమ చతురావరణయొక్క నాలుగు మూలల వున్న గోడలు వెలుపలికి వ్యాపించి యీ గుండ్రని గోడలతో కలిశాయి. యీ గుండ్రని గోడలచుట్టూ వెలుపలి భాగాన 11 అడుగుల 7 అంగుళాల దూరాన మరియొక గుండ్రని గోడ వుంది. దీని మందము 18 అడుగుల 3 అంగుళాలు. దీని వెలుపలి భాగాలకు సున్నము చేయించబడింది. ఈ రెండు గుండ్రని గోడలకు నడుమనున్న ప్రదేశాన్ని 16 అరలుగా విభజించారు. లోపలగల చిన్న గుండ్రని ఆవరణలో 16 అరలు వున్నాయి. ఈస్థూపంలో మొత్తం 32 అరలున్నాయి. వీటిని పాటి మట్టితో గట్టిగా పూడ్చారు. దానిచుట్టూ 5 అడుగుల 7 అంగుళాల వెడలువు, 4 అడుగుల 5 అంగుళాల ఎత్తుగల పిట్టగోడవుంది. దీనిపైన ప్రజలు గుంపుగా ప్రదక్షిణం చేయటానికి తగినంత వీలుంది. దీనికి నాలుగు వైపుల 6 అడుగుల వెడల్పు, 17 అడుగుల 6 అంగుళాల పొడవుగల మెట్లున్నాయి. దీని ఆవరణ గోడ పైన గూడా సున్నము వేసినట్లు కనుపిస్తూ వుంది.

స్థూపము మధ్య భాగాన మూడు అడుగులలోతులో, తొమ్మిది అంగుళాల చౌకంగల ఒకచిన్న సుయ్యివుంది. దానిలో ఒక చిన్న కుండవుంది. అది మట్టితో కప్పబడివుంది. దానిలో యీ క్రిందివస్తువులున్నాయి. (1) అంగుళాల చౌకంగల ఒక సీసపు నాణెంవుంది. దానికి ఒక వైపున అస్పష్టమైన గుర్తు కనుపిస్తూంది. (2) అంగుళాల పొడువుగల ఒకస్ఫటికపు పూస దొరికింది. ఇది పంచకోణాకారంగా వుంది. స్వేతనీల వర్ణాలతో మెరుస్తూ వుంటుంది. (3) మూడు చిన్నపూసలున్నాయి. 4 ఎరుపు. తెలుపు నీలపు రంగుగల కొన్ని స్ఫటికపురాళ్లు లభించాయి.

పై కుండకు క్రింద మరిఒక చిన్న ఎఱ్ఱని మట్టిచట్టివుంది. దీని ఎత్తు మధ్య కొలత 4½ అంగుళాలు, దీనిపైన అర్ధచంద్రాకృతి గల భరిణెమూత వుంది. దీనిలో ఐదు చిన్న గుండ్రని పూసలు ఒక చిన్న ముత్యపు చిప్ప; రెండు చిన్న ముత్యాలు, రెండు పసుపు పచ్చని స్ఫటికపు ముక్కలు, మరియేవో గుర్తించటానికి వీలులేని కొన్ని లోహపు ముక్కలు లభించాయి.

ఈ స్తూప నిర్మాణ విధానం మిక్కిలి విశిష్టమైంది. విలక్షణమైంది. అమరావతి, నాగార్జున కొండలయందలి స్తూపాలు నిర్మించిన పిమ్మట ఇది నిర్మింపబడివుంటుందని పురాతత్వ శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. ఇట్టి విచిత్ర నమోనాలో నున్న స్తూపం దక్షిణ భారత దేశంలో మరెచ్చటా కనిపించటంలేదని వారు ముక్తకంఠంతో వక్కాణించారు.

అచట జరిపిన ఖనన పరిశోధనలలో బుద్ధ భగవానుని శ్రీపాద చిహ్నముగల ఒక పాలరాయి కనిపించింది. దీనికి వున్న మూడు కోణాలు విరిగిపోయాయి. మడమల వెనుక ఒక తామర పుష్పగుచ్ఛం వుంది. మడమల మీద రెండు చక్రాలున్నాయి. దీని చుట్టూ అనేకములైన దివ్యచిహ్నాలు అతి సుందరంగా మలచబడి వున్నాయి. అవన్నీ చాలావరకు శిథిలమైపోయినాయి. స్వాస్తిక, త్రిశూల చిహ్నాలుమాత్రం స్పష్టంగా కనుపిస్తున్నాయి.

ఇచ్చటి శిధిలాలలో భైరవస్వామి, సరస్వతీ దేవి, మొదలైన హైందవ దేవతల విగ్రహాలు చెక్కబడిన రాళ్లు దొరికాయి. ఇవి పనితనంలో కొంత మొరటుగా ఉన్నాయి. జలధీశ్వరస్వామి వారి ఆలయంలో అవి భద్రపరుపబడివున్నాయి.

ఇవి గాక యీ బౌద్ధచైత్యమందు బుద్ధుని పాదచిహ్నాలు గల ఒకరాయి, ఒక సింహము, ఒక బౌద్ధ అర్హతుని ప్రతిమ, ఒక మహానాగం ప్రతిమ గూడా లభించాయి. ఇవన్నీ అపరూప శిల్ప విన్నాణంతో అందంగా మలచబడి వున్నప్పటికీ కొంత శిధిలావస్థలో వున్నాయి.

పైన తెలిపిన మహానాగ ప్రతిమను జలధీశ్వరస్వామి వారి ఆలయంలో, ఒకవైపున వున్న సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి ఆలయం వెనుక వుంచారు. దీని శిరస్సు కొంత పాడైపోయింది. కాని భక్తులు సిమెంటుతో దానిని బాగుచేయించారు. ఈ ప్రతిమకు మార్గశిర శుద్ధషష్టినాడు స్థానికులు మిక్కిలి వైభవంగా పూజాదికాలు నిర్వర్తిస్తూ వుంటారు.

ఘంటసాలలో లభించిన కొన్ని శిల్ప రాజాలను ఇతర ప్రాంతాలకు తీసికొని పోయినట్లు బహు గ్రంథకర్తలు ప్రముఖ పత్రికా సంపాదకులు అయిన శ్రీ నార్ల వేంకటేశ్వరరావు గారు, తాము విదేశాలను దర్శించినప్పుడు, చూచిన విషయాలను తెలి

పారు. వాని వివరాలను యీసందర్భంలో తెలియ జేయటం చాలా సమంజసమని భావిస్తున్నాను. (1) కంటకము చిత్రం వున్న శిల్పాన్ని ఘంటసాల నుండి తీసుకొనివెళ్ళి మద్రాసు మ్యూజియంలో వుంచారు. ఇది మిక్కిలి అందమైన శిల్ప చిత్రం. (2) ఈ ప్రాచీన బౌద్ధ స్తూపానికి జెందిన కొన్ని రమణీయ శిల్ప ఫలకాలను పారీస్ నగరమందలి మ్యూజీయమ్ మెట్లలో వుంచారు. అక్కడ వున్న వాటిలో ఒకపాలరాతి ఫలకంలో మూడంతస్తుల మందిరం మలచబడివుందట. అందలి శిల్పవిధానం అతిలోక రమణీయంగా వుందట. ఆ మందిరంవద్ద కొందరు భక్తులు చెక్కబడి వున్నారట. ఆ మూర్తులు జీవకళతో కళ కళలాడుతూ వుంటాయట. మరియొక చెక్కడంలో పుత్రజనన వార్త విని, ఆనంద పరవశంతో తన్మయత్వంజెందుతూ వున్న శుద్ధోధన మహా రాజు చెక్కబడి వున్నాడట. వేరొక చెక్కడంలో భార్యాపుత్రులను పరిత్యజించి అరణ్యాలకు, బయలుదేరి పోతున్న సిద్ధార్థుని బొమ్మ శిల్పింపబడి వుందట. (3) ఘంటసాల బౌద్ధ శిల్పాలకు తలమానికమైన ఒక చెక్కడం బోస్టన్ నందువున్నది. ఆ చెక్కడానికి యిరువైపుల రమణీయమైన చిత్రాలు మలచబడి వున్నాయి. ఆ పాలరాతి ఫలకానికి ఒకవైపు అమరావతీ స్తూపంవంటి స్తూపం శిల్పింపబడివుంది. దానికి రెండవవైపున నిరంజన నదీతీరంలో బుద్ధ విగ్రహం మలచబడివున్నదట.

ఈ శిల్పరాజాలన్నీ మన బౌద్ధాంధ్రుల, కళా వైశద్యాన్ని శిల్పకళలో వారికిగల ప్రావీణ్యాన్ని ఘనంగా చాటి చెబుతున్నాయి.

ఘంటసాల వద్దగల మహా స్తూపం ఆంధ్రదేశంలో గల యితర స్తూపాలకన్నా మిక్కిలి ప్రముఖమైందని, పెద్దదిగా వుండేదని పురాతత్వ శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఇచ్చటి శిల్పరీతులు అన్ని విధాల అమరావతీ శిల్పరీతులతో పోలి ఉండటమే గాక, అంతకన్న ఒక మెట్టు అధిగమించి వున్నవని గూడా కొందరు భావించుతున్నారు. దీనికి ప్రబల సాక్ష్యంగా ఇక్కడ లభించిన బుద్ధభగవానుని విగ్రహపు శిరస్సును చూపుతున్నారు ఈ శిరస్సు అమరావతి నాగార్జున కొండయందలి విగ్రహాల శిరస్సుల కన్న మిక్కిలి ఆకర్షణీయంగాను, రమణీయంగాను మలచబడివుండి, గొప్ప శిల్ప విశిష్టతతో కళ కళలాడుతూ, కన్నులకు మిరుమిట్లు గొలుపుతూ వుంటుంది.

ఘంటసాల బౌద్ధ తీర్థానికి సంబంధించిన పెక్కు అపురూప శిల్పాలు, ప్రధాన స్తూపంగల 'లంజదిబ్బ' యందు మాత్రమేగాక, అక్కడికి సమీపంగల కోటదిబ్బలోను, పొలిమేరదిబ్బలోను, గూడా లభించినాయి. కాని యీ శిల్ప సముదాయము నందలి అధిక భాగం తెలుగు వారి దురదృష్టవశాన పర దేశాలకు తరలింపబడ్డాయి. పగిలిపోయిన కొన్ని ముక్కలు, అందలి కొన్ని హీనమైన కొన్ని విగ్రహాలుమాత్రం ఘంటసాలలో కనుపించుచూ, ఆవి తమ పూర్వ వైభవాన్ని, నామమాత్రావశిష్టంగా బయలు పరుస్తూ, యోగభ్రష్టుడైన యోగిపుంగవునివలె యీ నాటికి దర్శన మిస్తున్నాయి. బౌద్ధాంధ్రుల ప్రాచీన సంస్కృతీ సభ్యతలను, కళావైభవాన్ని, ఖండాంతర కీర్తి సందను, బహుముఖాలుగా చాటి చెపుతూ, ఘంటసాల చారిత్రిక జిజ్ఞాసువులకు దర్శనీయమై, అధ్యయన కేంద్రమై వున్నదని మాత్రం నిస్సంశయంగా చెప్పవచ్చును.

---

## వస్తున్నాను ★ మంజీర

వస్తున్నాను
దారి పొడుగున ముళ్ళున్నా
ముళ్ళదారినే వస్తున్నాను
మానవాళికి మంచిని పంచాలని
సహనంతో—సంప్రీతితో
ముళ్ళదారినే వస్తున్నాను
'మమత'ల జల్లులను కురిపించి
అనురాగపు పంటను
పండిస్తాను
దీనుల గుండెల్లో
అజ్ఞాతంగా నిండుకున్న ఆర్తిని
తొలగించుటకు

కరుణాజ్యోత్స్నలను
కురిపిస్తాను
కవితా విపంచిని మీటి
ఎలుగెత్తి గానం చేసి
కఠిన శిలామూర్తుల
కలలను కరిగిస్తాను
వాడిన మోడుల్ని చిగురించుటకు
వసంతం వచ్చినట్లు
జీవితంలో ఓడిపోయిన వాళ్ళను
ఓదార్చుటకు
జీవనలతను పల్లవింప జేయుటకు
వస్తున్నాను
దారిపొడుగున ముళ్ళున్నా

ముళ్ళదారినే వస్తున్నాను
నాగరికత పేరుతో
ఆధునికులు విసర్జించిన
సనాతన సంప్రదాయాలను
మళ్ళా వెలుగులోకి తెస్తాను
అంశాంతిని ఆశ్రయించి
నిద్రాణమైయున్న
నిఖిల లోకాన్ని
మేల్కొలిపి—
శాంతి గీతాన్ని ఆలాపిస్తాను
అభ్యుదయాన్ని ఆకాంక్షించే
జనావళికి
ఆశీస్సులు పలుకుతాను.

# గుంటూరు జిల్లాలో బలహీన వర్గముల సంక్షేమము

కాసు వెంగళరెడ్డి

మన ప్రజాస్వామ్య రాజ్యాంగములోని ప్రాథమిక హక్కుల అధ్యాయములో, జాతి, మత, కుల, వర్గ విచక్షణా రహితముగా భారత ప్రజలందరికి సమాన హక్కులను సమకూర్చ వలసినదిగా సువర్ణాక్షరములతో పొందుపరిచియున్నారు ఈ సూత్రము ఆచరణలో పూర్తిగా అమలు జరుగలేదు. కాలక్రమముగా, స్వాతంత్ర్యోదయ కాలము నుండి ప్రతి పౌరునిలో పౌర హక్కులు బాధ్యతల గూర్చి జిజ్ఞాస, మెరుగైన జీవితము కొరకు నిర్మాణాత్మక కృషి ఆకాంక్ష నానాటికి హెచ్చుచున్నవి. రాను రాను ఈ కలలు నిజమగు అవకాశములు కానవచ్చుచున్నవి.

తల్లి తమ బిడ్డలపై సమభావమునే కలిగి యున్ననూ, తన పిల్లలలో బలహీనులపై ప్రత్యేక శ్రద్ధ చూపును గదా. ప్రభుత్వములు గూడా ఆ విధానమునే అవలంబిస్తాయి.

భారత ప్రధాని నెహ్రూ స్వతంత్రావతరణ సందర్భమున జాతీయ సదస్సులో ప్రసంగించుచూ, భారత దేశమునకు సేవ చేయుట అంటే పీడితులైన లక్షలాది ప్రజలకు చేయవలసిన సేవ. అనగా అమాయకత్వము అవిద్య, దారిద్ర్యము, అసమానతల నిర్మూలన అని అర్థము–అని అన్నారు ప్రతి పౌరుడు తన జీవితావసరాలను సఫలీకృతము చేయగల మార్గములను కల్పించవలెనని ప్రభుత్వము నుండి ఆశించును.వారి ఆశలను ప్రభుత్వం నెరవేర్చును.

సామాన్య పౌరుని స్థితి గతులను మెరుగు పరుచుట యను నది యిప్పటి వరకు ఆచరణలోనున్నా, గుంటూరు జిల్లాలో ఇప్పటి పరిస్థితి ఒక నూతన స్వరూపమును సంతరించుకొన్నది. ఈ జిల్లాలోని సామాన్య పౌరుని జీవితములో గమనార్హమైన అభివృద్ధి వ్యక్తమగుచున్నది. జిల్లా కలెక్టరు శ్రీ వెంకట రత్నంగారి అచంచల దీక్ష,నిర్విరామ కృషి ఫలితముగా ఇప్పటి వరకూ ఇతిహాసముగానున్న అభివృద్ధి, జీవన సత్యముగా రూపొందుచున్నదనుటలో అతిశయోక్తి లేదు.

ఇటీవల మన ప్రజలలో చిరునవ్వులు చిందే ఉత్సాహ పూరిత వాతావరణము వికసితమగుచున్నది. ఇదే ఒక నూతన సాంఘిక వ్యవస్థకు, ఆర్థిక, సాంఘిక న్యాయ ప్రతిష్ఠకు నాంది కాగలదు. ఈ తరుణములో ప్రజల ఆశలు, ఆశయములు, జీవన పథములో నిర్మాణాత్మక కృషివైపుకు తరలించవలసిన బాధ్యత ప్రభుత్వమువారిది.

## కలలు పండిన తరుణము

1969 లో ఈ జిల్లాను తుడిచి పెట్టిన తుఫాను వందలాది ప్రజలను వేలాది పశువులను పొట్టను బెట్టుకొన్న ఆ పెను తుఫాను మనకు ఒక విధముగా మేలే చేసినదేమో. ఎందుకనగా పెక్కు క్రొత్త వసతి గృహములు, పాఠశాలా భవనములు గృహ నిర్మాణ పథకములు రూపొంది, పీడిత ప్రజానీకము యొక్క ప్రగతికి దోహదము చేసినది.

## పునరావాస కార్యక్రమము

సమాజములోని దళిత వర్గములకు మంచి గృహములను నిర్మించి, వేలాది కుటుంబములకు పునరావాసము కల్పించుట వలన, వారిలో ఆశలు చిగురించి, భావిప్రగతి మార్గదర్శకమైనది ఇప్పటికి 122 గ్రామములలో ఒక కోటి రూపాయల ఖర్చుతో 7,622 గృహములు నిర్మించినారు. ఇంకనూ జిల్లా పరిషత్ వారి సహాయముతో రూ. 40,10,000 ల ఖర్చుతో నూరు గ్రామములలో 3,000 గృహముల నిర్మాణము సాగుచున్నది.

కాని స్థలములు సేకరించి గృహములు కట్టించినంత మాత్రముతో ప్రభుత్వ బాధ్యత పూర్తి కాదు. అదే సమయములో ఇతర సౌకర్యములు సమకూర్చవలసిన అవసరము కూడా వున్నది. మంచినీటి వసతి, విద్యుత్ సరఫరా, రోడ్లు, పాఠశాలలు, మరియు సమాజ కేంద్రముల నిర్మాణము వీటిలో ముఖ్యమైనవి చాలా కాలనీలలో ఇప్పటికే రోడ్లు, విద్యుత్ సరఫరా జరిగింది. జిల్లాపరిషత్‌లో నిధుల కొరత వలన, అన్ని కాలనీలలో ఈ సౌకర్యములు వర్తించబడలేదు. అయినప్పటికీ జిల్లాపరిషత్‌వారు ఉదారముగా పాఠశాలలో విద్యుద్దీపముల, సమాజ కేంద్రముల, నిర్మాణమునకుగాను రూ.1,50,000 లను మంజూరు చేసియున్నారు. ఈ కాలనీలలో కూరగాయల తోటలు పెంచుటకు కూడా కృషి జరుగుతున్నది

## పాఠశాలలు, విద్యార్థి వసతి గృహములు

విద్యారంగములో, హరిజనులకు 112 పాఠశాలలు, గిరిజనులకు 44 పాఠశాలలు నడుపుచున్నారు. ఈ సంస్థకుగాను సంవత్సరమునకు 6 లక్షల 20 వేల రూపాయలు ఖర్చు చేయుచున్నారు.

హరిజనులకు 77 హాస్టళ్ళు, గిరిజనులకు 75 హాస్టళ్ళు నడుపబడుచున్నవి. వీటికై సాలీనా 25 లక్షలు వ్యయమగుచున్నది. ఇదిగాక హరిజన గిరిజన కుటుంబములో 6,972 మందికి, 13,482 ఎకరముల బంజరు భూమిని పంచి పెట్టినారు.

వీరిలో చాలామంది గ్రామములకు దూరముగా మురికి వాడలలో నివసించుచుండెడివారు. ఇప్పుడు వీరిలో చాలామందికి

గృహవసతికై స్థలములను మంజూరుచేసి ఒత్తిడి తగ్గించి యున్నారు.

## చేనేత పారిశ్రామికులు

ఈ జిల్లాలో తగు శాతములో చేమగ్గములపై జీవించు చేనేత పారిశ్రామికులు వెనుకబడిన వర్గములలో నున్నారు. వీరి పరిస్థితులను మెరుగు పరచుటకు 3,321 కుటుంబములకు రూ. 14.46 లక్షల విలువగల మగ్గములను, నూలును సరఫరా చేసియున్నారు. 3,000 రజక కుటుంబములకు 1.60 లక్షల ఖర్చుతో ఇస్త్రీ చేయు బల్లలు సరఫరా చేసియున్నారు 1,189 మంది నాయీ బ్రాహ్మణులకు వారి కులవృత్తికి అవసరమగు పరికరములు యివ్వబడెను.

## చేతి వృత్తుల పనివారు

6,960 కుటుంబముల చెప్పులు కుట్టు పనివారికి తోలు మొదలైన సరుకును రూ. 2.06 లక్షలు విలువగలవి సహాయం చేసియున్నారు. 180 కమ్మరి కుటుంబములకు రూ. 2.35 లక్షల ఖరీదుచేయు కమ్మరి సామానులు సరఫరా చేయబడెను

## బెస్తవారికి సహాయము

6,867 బెస్త కుటుంబములవారికి రూ. 4.5 లక్షల విలువ గల వలలు, బోట్లు మొదలైనవి సరఫరా చేసియున్నారు. వాతావరణ విశేషములు ఎప్పటికప్పుడు తెలుసుకొనుటకు వీలుగా వారి వాడలకు 15 రేడియో సెట్లు సప్లై చేయబడెను.

ప్రతి సంవత్సరము రూ. 4.5 లక్షల ఖర్చుతో 3,688 మంది వృద్ధులకు, అవిటివారికి పెన్షన్లు మంజూరు చేయబడెను.

## స్త్రీ సంక్షేమము

స్త్రీ సంక్షేమ పథకము క్రింద గమనార్హమైన ప్రగతి సాధించియున్నారు. మూడు బాలల సంక్షేమ కేంద్రములు, ఒక బాల విహారు, అంధులకు వికలాంగులకు మూడు సంక్షేమ కేంద్రములు ఏర్పాటు చేసియున్నారు. గుంటూరు పట్టణములో రూ. 49,000 ఖర్చుతో ఒక మహిళామండలి భవన నిర్మాణము పూర్తి కావచ్చినది.

## భూ వసతి కల్పించుట

వినుకొండ తాలూకాలో వెనుకబడిన జాతుల వారికి పునరావాసము కల్పించుటకై అడవులను నిర్మూలించిన 51,000 ఎకరములలో కృషి జరుగుచున్నది. రూ. 60 లక్షల ఖర్చుతో ఒక బృహత్తర పథకముద్వారా, భూమి మరమ్మత్తుచేసి ఈ కాలనీని అభివృద్ధిపరచుటకు నిశ్చయించినారు. త్వరలో అమలు జరుపగలరు.

## గృహ నిర్మాణ సంస

హరిజనుల గిరిజనులకొరకు గృహ నిర్మాణ సంస్థ రిజిస్టరు చేయబడినది. దీని ద్వారా రూ. 18 లక్షల ఖర్చుతో జీవిత భీమా సంస్థ ఆర్థిక సహాయముతో 1,000 కుటుంబములకు గృహవసతి కల్పించుటకు కృషి జరుగుచున్నది.

హరిజన గిరిజన కుటుంబములకు ఇళ్ల స్థలములను సేకరించుటకుగాను ఈ ఆర్థిక సంవత్సరములో రూ. 50 లక్షలు ఖర్చు చేయనున్నారు ఇప్పటికే 400 గ్రామములలో ఇళ్ళ స్థలములను సమకూర్చినారు మిగతా గ్రామములలో వచ్చే సంవత్సరము ఇళ్ళ స్థలముల కేటాయింపు పూర్తి చేయబడును. రూ. 12 లక్షల ఖర్చుతో 246 గ్రామములలో హరిజన, గిరిజన వాడలకు రోడ్లు ఆరోగ్య సౌకర్యములను ఏర్పాటు చేయుటకు, హరిజనవాడలలో సమాజకేంద్ర భవనములు, రేడియోలు, పఠనాలయములు ఏర్పాటు చేయుటకు ఇప్పటికి రూ. 7.38 లక్షలు ఖర్చు చేసియున్నారు. హరిజనుల సర్వతోముఖాభివృద్ధికిగాను ఇప్పటికే 400 గ్రామములలోని హరిజన వాడలలో విద్యుత్ సౌకర్యాలు కల్పించబడెను.

శీతానగరము, స్టూవర్టుపురము గ్రామములలో గిరిజనులకు విద్యా వైద్య సౌకర్యములు కలుగజేసి అక్కడనున్న 600 కుటుంబములవారి వసతికై సంవత్సరమునకు రూ. 1.50 లక్షలు వ్యయము చేయుచున్నారు.

ప్రజా హిత సంస్థలు, స్వచ్ఛంద సేవా సంస్థలు, దాతల సహకారముతో ఈ దళిత జాతుల అభివృద్ధి కార్యక్రమములు అతి త్వరితగతిని ప్రగతిని సాధించగలవు.

---

## పాఠకులకు......

ఈ సంచిక ఎలా వుంది?

ఇంకా ఎలా వుండాలని మీ ఉద్దేశం?

సలహాలు కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

(ప్ర. సం)

# పరీక్షల తొలగింపు - ఉపాధ్యాయుల ఇతోధిక బాధ్యత

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

అనూచానముగ వచ్చుచున్న ఒక పద్ధతి తొలగింపబడగానే సామాన్యులు చకితులగుట సహజము. ఎంతమంచి పద్ధతియైనను, ప్రవేశపెట్టినపుడు ఎన్నో సదాశయములతో రూపొందింపబడినను, కాలక్రమమున ఆ పద్ధతి ఆచరణమునపెట్టినవారి దృక్పథములు విలువలు మారుచుండుట వలన అనర్థదాయకముగ పరిణమించుట, అనుభవవేద్యము. ఈ సత్యము ఆర్థిక సాంఘిక రాజకీయ రంగములతోపాటు విద్యారంగమునకు గూడ వర్తించును. టెన్నిసన్ మహాకవి ఆర్థరు రాజు నోట ఈ సత్యమునే వెల్లడించినాడు.

"The old order changeth yielding place to new
And God fulfils Himself in many ways
Lest one good custom should corrupt the world

విద్యారంగమున ప్రతి తరగతిలోను పరీక్షలు జరిపి విద్యార్థుల స్థాయిని మదింపువేసి పై తరగతికి పోవు అర్హత ఉన్నదో లేదో గమనించుట చిరకాలమునుండి వచ్చుచున్న పద్ధతి. పరీక్షార్థము నిర్ణయింపబడిన పాఠ్యభాగములలో, ఒక నిర్దిష్టమైన నమూనాపై తయారుచేయబడిన ప్రశ్నాపత్రమునకు జవాబులు వ్రాయించి, ఉత్తీర్ణతకు కొన్ని మార్కులు నిర్ణయించి ఫలితములు తేల్చు విధానము పెక్కు దశాబ్దములనుండి అమలులోనున్నది. ఇంత మాత్రమున విద్యాప్రమాణముయొక్క సిసలైన మదింపు జరుగుననికాని, ఏ లక్ష్యములు సాధించుటకు విద్య బోధింపబడుచున్నదో ఆ లక్ష్యములెంత వరకు సిద్ధించినవో నిర్దుష్టముగ చెప్పవచ్చునని కాని అంగీకరింపలేము.

సక్రమముగ ఈ పరీక్షలు జరిగినంతవరకు ఏదో విధముగ తృప్తిపడి పరీక్ష యనునది "ఆవశ్యకమైన చెడు" (a necessary evil) గా భావించి ఓర్చుకొనుట జరిగినది. క్రమక్రమముగా విద్యార్థులు, ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు ప్రధానమైన పాఠ్య విషయావగాహనము, ఆలోచనశక్తి, భావవ్యక్తీకరణసామర్థ్యము, శాస్త్రీయ దృక్పథము, భాషాపాటవము మొదలయిన యంశములను విడిచిపెట్టి ఏదో ఒక పద్ధతిని పరీక్షలో ఉత్తీర్ణత పొందినట్లు ప్రమాణ పత్రము సంపాదించుటయందు దృష్టిని కేంద్రీకరించుచుండుట జరిగినది. తత్ఫలితముగ పరీక్షలలో కృతార్థులైనవారికిని కానివారికిని అదృష్ట దురదృష్టములలోనే వ్యత్యాసముగాని యథార్థమైన విద్యాప్రమాణమున మాత్రము వ్యత్యాసమున్నట్లు నిర్దుష్టముగ చెప్పగలిగిన యవకాశము లేకపోయినది. పరీక్షా ప్రశ్నపత్రముల నమూనాను మార్చినచో కొంతవరకు లోపములు సవరింపబడునేమోయని ఆశించే వివిధములైన ప్రయోగములు జరిగెను. కాని అవి నిష్ఫలమగుటయేగాక, విద్యార్థుల అవాంఛనీయ పద్ధతుల వలన పరీక్షల నిర్వహణమే ఒక గండముగా తయారై పోలీసు బందోబస్తుతో పరీక్షా పర్యవేక్షకుల క్షణ క్షణ ప్రమాదభీతితో చెప్పుకొనుటకు సిగ్గుపడవలసిన పరిస్థితులేర్పడినవి. నయము చేయలేని బాధను అనుభవింపవలసిందే (What cannot be cured must be endured) యను సూక్తి ప్రకారము ఎంత ప్రయత్నించినను నయముచేసికొనజాలని దుర్భర దోషభూయిష్టమయిన యీ పరీక్షలను అనుభవించుచు వచ్చితిమి. మరమ్మత్తుచేయ వీలులేనిది అంతమొందింపబడవలెనని గూడ యింకొక సూక్తి. (What cannot be mended must be ended) ఈ సూక్తిని గుర్తించి కాబోలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇటీవల 7, 10 తరగతులలో తప్ప మిగిలిన తరగతులలో—ప్రాథమిక, ఉన్నత పాఠశాలలలో—పరీక్షలపై ఆధారపడి బాలబాలికలను ఆయా తరగతులలో ఉంచివేయ కూడదనియు, పై తరగతులకు పంపవలెననియు సాహసోపేతమైన ఉత్తరువును జారీచేసినది. ఈ చర్యపై భేదాభిప్రాయము ఉండుట సహజమే అయినను, ప్రభుత్వము తీసికొనిన చర్యవెనుక నేటి పరీక్షా విధాన వైఫల్యముచే కలిగిన తీవ్ర ఆవేదన, దానిని కొద్ది కొద్ది మార్పులతో సంస్కరింపలేమను దృఢ నిశ్చయము, నానాటికి క్షీణించుచున్న విద్యాస్థాయిపట్ల నిస్పృహ గోచరించుచున్నది. ఈ నిర్ణయమును సదుద్దేశముతో మనస్ఫూర్తిగా స్వీకరించి కర్తవ్య నిర్వహణమున ఉపాధ్యాయులు త్రికరణశుద్ధి ప్రదర్శించుటయేకాక ఇతోధిక బాధ్యతను గుర్తింపవలెను.

## దృక్పథంలో మార్పు

మొదట ఉపాధ్యాయుల దృక్పథములో అసందిగ్ధమైన మార్పు రావలెను. ఒకానొక నమూనా ప్రశ్నపత్రమననుసరించి కొన్ని ప్రశ్నలకు జవాబులు వ్రాసి విద్యార్థులచే కంఠస్థము చేయించుట తమ ధర్మము కాదను గుర్తింపు కలుగవలెను. విద్యార్థుల క్రమశిక్షణ నిజాయితీ, విశాల హృదయము, భక్తి, విశ్వాసము మొదలగునవి పెంపొందుటకు పాఠ్యభాగములలో ఎట్టి అవకాశములున్నవో పరిశీలించి వానిని పూర్తిగా వినియోగించుకొని బాల బాలికల సంపూర్ణ వ్యక్తిత్వ వికాసమునకు కృషిచేయుట తమ ధర్మమని గుర్తింపవలెను. విద్యా బోధనము పరీక్షలలో ఉత్తీర్ణత సంపాదించుటకు పరిమితము కాకూడదు. అట్లు పరిమితమైననాడు ఆ పరీక్షా పద్ధతి విద్యాప్రమాణములకు దోహదకారి కానేరదు.

## యావజ్జీవ విద్యార్థులు

ఉపాధ్యాయులు తాము శిక్షణ సంస్థలలో నేర్చుకున్నదే

తుదిమాటయను భావము విడిచిపెట్టి ఎప్పటికప్పుడు ప్రచురితములగు బోధన పద్ధతులు. పరీక్షల విధానము, పరీక్షలు బాలబాలికల క్రమాభివృద్ధికి వినియోగించుతీరు, మానసికతత్త్వ విషయములు, పరిణామ శీలము అగు ప్రపంచమున విద్యయొక్క ప్రయోజనము మొదలగునవి పరిశీలించుచు తదనుగుణముగ తమ్ము తాము రూపొందించుకొనవలెను. ఉపాధ్యాయులు యావజ్జీవ విద్యార్థులన్న మాట మరువ కూడదు.

బోధన, శోధన, (Teaching and Testing) పరస్పర ఆధారములు. ఇవి విజయవంతముగ నడువవలెనన్న పాఠ్యాంశము నే లక్ష్యముతో బోధింపవలెనో స్పష్టముగ ఏర్పరచుకొని, ఆ లక్ష్యములు సాధించుటకు ఎట్టి బోధన పద్ధతులవలంబించవలెనో ముందుగానే తయారయి, ఆ అంశము ముగిసినపిదప ఆ లక్ష్యములు ఎంతవరకు చేరుకొనబడినవో శోధింపవలెను. చాల మంది ఉపాధ్యాయులు ఏదైన విషయము "మీకు బోధపడినదా" అని విద్యార్థుల నడుగుచుందురు. అట్లుకాక "నేను బోధించిన విషయములు విద్యార్థులకు అవగతములైనవా" యను ప్రశ్న ప్రతి ఉపాధ్యాయుడును తనకు తానే వేసుకొనవలెను. "విద్యార్థుల కవగతమైనట్లు బోధింపగలిగితినా" అని ప్రశ్నించుకొనుట ఉత్తమము. ఆ ప్రశ్నకు జవాబుకొరకు తగిన పరీక్ష చేయవలెను.

ఇక నూతన వ్యవస్థలో పరీక్షలకు గల స్థానము, ప్రయోజనము, పద్ధతి, అభివృద్ధి, మదింపు, మొదలైన విషయములలో ఉపాధ్యాయుల బాధ్యత గరిష్టమైనది. ఏ పరీక్షయైనను ముఖ్యముగా ఈ క్రింది సూత్రములపై జరుగవలెను.

1. ఏ విషయ పరిజ్ఞానము, ఏ నైపుణ్యములు శోధింపదలచితిమో అసందిగ్ధముగ నిర్ణయించుకొనుట.
2. తయారు చేసిన ప్రశ్న పత్రము పై విషయములను యథార్థముగా శోధింపగలిగినదై ఉండుట.
3. పరీక్షకుని ఇష్టానిష్టములపై, వ్యక్తిగతముగ ఆధారపడిగాక జవాబులయొక్క తప్పొప్పులపై విలువ కట్టుటకు అనుకూలముగ ఉండుట.
4. జవాబులను దిద్దిన తరువాత ఏ విద్యార్థి ఎట్టి లోటుకలిగి యుండెనో తెలిసికొనుట.
5. ఆ లోటును పూరించుటకు తీసుకొనవలసిన చర్య నిర్ణయించుకొనుట.

## పరీక్షల లక్ష్యం

పరీక్షలు కేవలము ఉపాధ్యాయులు తమ అనుగ్రహమునకు పాత్రులైన బాలబాలికలకు "ఉత్తీర్ణత" ప్రసాదించుటకును ఆగ్రహమునకు పాత్రులైనవారిని ఆ తరగతిలోనే ఉంచుటకును, పనికివచ్చు సాధనములు కాకూడదు. పరీక్షల లక్ష్యములు:

1. విద్యార్థికి ఆయా విషయములలో గల స్థాయి తెలియజేయుట.
2. ఉపాధ్యాయునకు ఏ విద్యార్థి ఏ నైపుణ్యము, ఏ విషయ పరిజ్ఞానము అలవరచుకొనగల్గెనో ఎందులో ఇంకను వెనుకపడి యుండెనో తెలియుట.
3. విద్యార్థి స్థాయిగూర్చియు, వెనుకబడిన పరిస్థితిగూర్చియు తల్లిదండ్రులకు, సంరక్షకులకు, తెలియుట.
4. ఉపాధ్యాయులు పిల్లల సంరక్షకుల సహకారముతో లోటును పూరించు విధానమును అవలంబించుట.

## ఉపాధ్యాయుల బాధ్యత

ఈ లక్ష్యసాధనములో పాఠశాలల యాజమాన్యము, ప్రభుత్వము నిర్వర్తింపవలసిన పాత్ర ఎంతో కలదు. ఉపాధ్యాయులకు నిర్దుష్టమైన ఉత్తమ బోధన పరిస్థితులలోను, శోధన విధానమునందును, తగిన పునశ్చరణ ప్రణాళికలు ఏర్పాటు చేయవలెను. పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు తోటి ఉపాధ్యాయుల బోధనమును, పరీక్షలను సాకల్యముగా పర్యవేక్షించు తమ అనుభవముతో వారికి తగుసూచనలు చేయు అవకాశము కల్పించవలెను. ప్రస్తుత వ్యవస్థలో అట్టి అవకాశము లేశమును లేదని చెప్పుటలో అతిశయోక్తి లేదు. పాఠశాలల "ఎకౌంట్లు" "కరస్పాండెన్సు" ప్రధానోపాధ్యాయుల కాలమును ఓపికను తినివేయుచున్నవి. ఈ పరిస్థితిని మార్చి ప్రభుత్వము, ఇతోధిక బాధ్యతను గుర్తించి ఉపాధ్యాయులను భావిభారత పౌరులను తీర్చి దిద్దుదురు గాక!

---

## రచయితలకు విజ్ఞప్తి

ఆంధ్రప్రదేశ్ పత్రిక గ్రామాల్లో సామాన్య ప్రజల దగ్గిరకు వెళ్ళే పత్రిక. అందువల్ల రచనల్లో సాధ్యమైనంతవరకు సరళమైన వ్యావహారిక భాష వాడితే అనుకూలంగా వుంటుంది.

(ప్ర. సం.)

# పొదుపు: నాడూ - నేడూ

అచ్యుతుని లక్ష్మీ కనకవల్లి

నాటి పెద్దలు ఆహార పానీయాలనే కాక కాలాన్నికూడా ఎంతో పొదుపుగా వాడుకునేవారని సామెతలద్వారా, ఆచార వ్యవహారముల ద్వారా స్పష్టమౌతున్నది. "పగటి మాటలు పనికి చేటు, రాత్రి మాటలు నిద్రకు చేటు" అన్న సామెత మాటలతో కాలాన్ని దుర్వినియోగం చేయవద్దు అని హెచ్చరిస్తున్నది. మౌనం పాటించటము వలన ఆయురారోగ్యములు వృద్ధి చెందుతాయని భోజన కాలమందు మౌనం వహించేవారు. మన గాంధీజీ ప్రతి సోమవారము మౌనం పాటించటము మనకందరికీ తెలిసిన విషయమే. "దణ్డో దమయతామస్మి, నీతిరస్మి జిగీషతామ్। మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్" అని శ్రీ కృష్ణ పరమాత్మ శ్రీ భగవద్గీతలో చెప్పినాడు. నేను దండించు వారియొక్క దండనమును, జయింప నిచ్చగల వారి యొక్క నీతియు అయి వున్నాను. మరియు రహస్యములలో మౌనమును జ్ఞానవంతులలో జ్ఞానమును నేనై వున్నాను అని పై శ్లోకముయొక్క తాత్పర్యము. స్త్రీలచే ప్రత్యేకముగా నాచరించబడు ఒక నోము గలదు. దాని పేరే "మూగనోము". ఆ నోము పట్టిన యువతి రాత్రి నక్షత్రాలను చూచేవరకు మౌనంగా వుండాలి. ఈ విధంగా మౌనంగా వుండటం అలవాటు చేసుకున్నందు వలన ఆయురారోగ్యములు అభివృద్ధి మాట అటుంచి, యిటు పోచుకోలు కబుర్లతో కాలక్షేపముచేసి లేనిపోని తగాదాలు తెచ్చుకోకుండా ఏదో ఒక పనిలోనో, భగవద్ధ్యానములోనైనా నిమగ్నులై కాలాన్ని సద్వినియోగ పరుచుకునేవారు. బ్రహ్మ ముహూర్తకాలములో నిద్రలేచుట ఆరోగ్యదాయకమని ప్రతివారు తెల్లవారు జామున నిద్రలేచి ఎవరి పనులను వారు ప్రశాంత చిత్తముతో నిర్వహించుకునేవారు. నేడో! ఏ కొద్దిమంది అలవాటు వున్నవారో లేక పొలం పనులు కలవారో తప్ప తక్కిన వారంతా ఆలస్యంగా నిద్రలేచి వురుకులు పరుగులమీద పనులు చేసుకుని ఏవో నాలుగు మెతుకులు నోటామూక్కా వేసుకొని ఆఫీసులకు, స్కూళ్ళకి పరిగెత్తుచున్నారు. ఇందువలన మానసిక ఆందోళన, శారీరక శ్రమకి గురియై అనారోగ్యవంతులగుచున్నారు.

పూర్వం దోవలో ఎక్కడైనా ఒక్క వడ్లగింజ కనిపించితే తెచ్చి గాదెలో వేసేవారని మన పెద్దలు చెప్పితే ఈ రోజులలో మనం నవ్వుతాము. కాని ఈ నాటికీ పల్లెలలో ఒక్క గింజ కూడా పారుపోనీకుండా ఏరి దాచేవారిని నేను చూచాను. "అన్నం పరబ్రహ్మ స్వరూపమని". అరికాలు అంటు ఆరునెలలకి కూడా పోదు, అని ఒక్క అన్నపు మెతుకు కూడా వృథాగా నేలపాలు కాకుండా మన పెద్దలు జాగ్రత్త తీసుకునేవారు. చిన్న పిల్లల దగ్గరనుంచి అన్నము వృథాగా పారవెయ్యకుండా ఎలా జాగ్రత్త తీసుకునేవారో తెలుసా? "భగవంతుడు ప్రతి జీవికి నీకు భూమిమీద యిన్ని గింజలు అని వ్రాసి పుట్టిస్తాడు. అవి ఖర్చుఅయిపోగానే ఆ జీవి చచ్చిపోతుంది. కనుక మనం అన్నం వృథాగా నేలపాలు కాకుండా జాగ్రత్త పడాలని" పిల్లలను భయపెట్టేవారు. ఎవరైనా మరణించితే "వానికి భూమిమీద నూకలు చెల్లిపోయినాయి" అనటం మనం నేటికి వింటూనే వున్నాము. నేడో "అబ్బో మా పిల్లలు కంచాల దగ్గర పారవేసినంత వుండదు" అని గొప్పగా చెప్పుకోవటం మనం వింటూనేవున్నాము. కొంతమంది విందుల సమయములో వడ్డనకి వచ్చిన ప్రతి పదార్థము వద్దు అనకుండా వడ్డించుకొని నిండు విస్తరి వదిలేసి పోవటం ఘనంగా భావించుతున్నారు. ఇలా ఎంగిలిచేసి వదిలివేసిన పదార్థములు ఇంకొకరికి పెట్టటానికికూడా పనికి రావు గదా. మనం తినవన్నా తినాలి లేకుంటే ఇతరులకైన్నా పెట్టాలి అనే భావము పసితనమునందే తల్లి తన బిడ్డలలో కలుగజేయాలి. బిడ్డల భోజన విషయం ఏ వంటవారిమీదనో, పనివారిమీదనో తల్లి వదిలివేయకూడదు. తల్లే దగ్గరవుండి భోజనాల దగ్గర మంచి అలవాటు నేర్పటం తల్లియొక్క ధర్మము. వెనకటికి ఒకడు "ఆ స్తంభము చాటు కుంభం ఎవరికిరా" అని అడిగాడట. "నీకేరా." అంటే "అయ్యో ఆ నాలుగు మెతుకులు నాకేమి సరిపోతాయి" అని వాపోయాడట. కనుక పిల్లల భోజనం విషయంలో తల్లి తగినంత శ్రద్ధ తీసుకోవాలి.

నాడే కాదు నేడు కూడా మంచినీటి ఎద్దడి ఎంతో వున్నది నీళ్ళు ఎక్కువగా వాడే వారి దగ్గర డబ్బు నిల్వవుండదు కనుక నీళ్ళనే జాగ్రత్తగా పొదుపుగా వాడుకోవాలని అంటూవుంటారు. ఇందుకు ఒక కథ చెప్పుతారు. ఒకరి దగ్గర పది పాడిగేదెలు వున్నాయి. ఇంకొకరి దగ్గర ఒక పాడిగేదె వున్నది. పది పాడిగేదెలు కల యిల్లాలు దుబారా ఖర్చుచేసుంది. ఒక రోజు ఈ యిల్లాలు ఒక పాడిగేదెవున్న యిల్లాలి దగ్గర నెయ్యి బదులు తెచ్చింది. కాని ఎంత కాలానికి తిరిగి నెయ్యి యివ్వలేదు. తీసుకెళ్ళిన నెయ్యి తిరిగి యివ్వమని ఒక పాడిగేదెగల యిల్లాలు అడిగితే "నాకు పది పాడిగేదెలు వున్నాయి. నీదగ్గర ఒక బోడి గేదెవున్నది. నీ దగ్గరా నేనుబదులు తెచ్చింది. ఎవరైనా వింటే నవ్వుతారు. పో" అని తగవులాడింది పాపం దిక్కుతోచక ఆ ఒక్కగేదెగల యిల్లాలు న్యాయాధికారి దగ్గర ఫిర్యాదు చేసింది. బాగా వానకురిసి వెలిసిన తరువాత ఆ స్త్రీలను యిద్దరినీ రమ్మనమని న్యాయాధికారి కబురు పెట్టాడు. బురదలో నడచిరావటం వలన ఆయిద్దరి స్త్రీలకాళ్లకి బురద అంటుకుంది. న్యాయాధికారి ఆ యిద్దరి స్త్రీలకి చెరి ఒక చెంబెడు నీళ్ళు యిప్పించి కాళ్ళుకడుక్కొని లోపలికి రమ్మన్నాడు. ఒక పాడిగేదెగల యిల్లాలు

ఆ ఒక్క చెంబు నీళ్లతో చక్కగా బురద అంతా పోయేలాగా కాళ్లు కడుగుకొంది. రెండవ ఆమె చెంబెడేకాదు బిందెడు నీళ్లు పోసి కడిగినా కాళ్లకున్న బురద పూర్తిగా పోలేదు. దీనిని గమనించిన న్యాయాధికారి పది పాడిగేదెలు వున్న యిల్లాలు దుబారా ఖర్చుచేస్తుంది కనుక నిజంగా నెయ్యికూడా బదులు తీసుకొన్నదని గ్రహించి తీసుకొన్న నెయ్యి యిచ్చివేయమని పది పాడిగేదెలున్న యిల్లాలిని ఆజ్ఞాపించాడు.

నాడు పండుగలకు, శుభాశుభాలకు తప్ప మిగతా రోజులలో సామాన్యంగా బట్టలను కొనేవారు కాదు. మరి నేడో ఏ రోజూ బట్టల దుకాణాలలో ఖాళీనే వుండదు.

ఇహ వినోద కాలక్షేపాలయిన వీధినాటకాలు, బొమ్మలాటలు, హరికథలు ఏ వున్న మహారాజులో రచ్చబండ దగ్గర ఉభయం యిచ్చి ఏర్పాటు చేయించితే అందరూ చూచి, విని ఆనందించేవారు. నేడో మరునాటికి బియ్యం లేకపోయినా తప్పనిసరిగా సినిమాలకి వెళ్లేవారు ఎందరో! ఒకామె రెండో ఆట సినిమాకి కూతుళ్ళు, కోడళ్ళతో సహా వెళ్ళింది. మరునాడు వుదయాన్నే "ఒదినా! ఒక శేరు బియ్యం యివ్వు సాయంకాలము తిరిగిస్తా" అంటూ ప్రక్కింటికి వెళ్ళింది. "ఏం ఒదినా రాత్రి కోడళ్లు, కూతుళ్లతో సహా సినిమాకి పోకపోతే ఆ రెండు రూపాయలు పెట్టి నిన్న బియ్యం కొనుక్కోలేక పోయినావు" అని మరల నోరెత్తకుండా సమాధానం చెప్పింది ఆ ప్రక్కయింటామె. ఆమె అన్నదాంట్లో వున్న సత్యాన్ని గ్రహించక పోగా "నేను సినిమాకుపోతే కళ్లల్లో నిప్పులు పోసుకోవటం ఎందుకు? నీవూ పోరాదూ. పిసిని గొట్టు, పిల్లికి బిచ్చము వేయదు. అని సణుక్కుంటూ తిరిగి వచ్చింది. ఇలా ఆ పూటకి లేకపోయినా వినోదాలకు ఖర్చు పెట్టేవారు కొందరైతే "వున్న పూట విందు లేని పూట మందు" అని ఏ పూట రెండు రూపాయలు సంపాదించితే ఆ పూట ఖరీదైన వంటకాలు వండి, పూలు, పండ్లు కొని ఆ రెండు రూపాయలలో ఒక్క పైసా కూడా మిగల్చని వారు ఇంకొందరున్నారు. డబ్బు సంపాందించిన పూట అయినా తీసుకొన్న బదులు తిరిగి యిద్దామని గాని, నాలుగు పైసలు దాచుకుందామని గాని వారికి తోచదు. ఇట్లా ఖర్చుచేసే గృహిణికి ప్రక్కింటి ఆమె ఏమి అప్పుయిచ్చేది కాదు. అందుకు ఆ గృహిణి కోపగించుకొని "ఏం! ఏది అడిగినా లేదు అంటావు. నీ యిల్లు మంగలమా" అంది. ఆ ప్రక్క ఇంటామె" నా యిల్లు మంగలమో! సుమంగళమో నాకు తెలుసు. మొదట నీ యిల్లు మంగలము కనుకనే కదా అగ్గి పుల్ల దగ్గర నుంచి అడుక్కుంటున్నావు అని చెప్పింది. అయితే తినకుండా, త్రాగకుండా, కట్టకోకుండా, దానం చేయక, ఒకరికి సహాయ పడకుండా, చూచి వినోదించక పోతే డబ్బు ఏం చేసుకోను? ఇంకా డబ్బు ఎందుకు? అవును. నిజమే. మరి. ఖర్చుకి మించిన ఆదాయం వున్నప్పుడు పొదుపు అన్న ఆలోచనే అనవసరము. ఖర్చుకి తగ్గ ఆదాయం లేనప్పుడే పొదుపుగా ఎలా వుండాలి అనే ప్రశ్న వుదయిస్తుంది. అయితే చిక్కు అంతా ఎక్కడ అంటే ఎవరుచేసే ఖర్చు వారికి దుబారా అనిపించక పోగా అత్యవసరంగా కనిపిస్తుంది. ఒకరికి కొత్తగా వచ్చిన ప్రతి సినిమా చూడటం ముఖ్యమనిపిస్తే ఇంకొకరికి సిగరెట్లు, హోటలు ఖర్చు అత్యవసరంగా కనిపిస్తే, ఇంకొకరికి బజారులోకి వచ్చిన కొత్త రకం చీరో వస్తువో కొనటం ముఖ్యముగా తోస్తుంది. ఆదాయానికి సరిపోయేటట్లు ఖర్చు చేయాలని ఇంటిలోని ప్రతి వారు గట్టిగా నిర్ణయించుకుంటే పొదుపు దాని అంతట అదే అలవాటు అవుతుంది. అప్పుడే అగ్గిపుల్ల నుంచి ఆదా చేయ కలుగుతారు. ఏది దుబారా ఖర్చో. వారికే తెలిసి పోతుంది.

పసితనము నుంచి ప్రతి పనిలోను జాగ్రత్త ప్రతి వస్తువు తగినంతలో వాడుకునే అలవాటు పిల్లలకు తల్లి కలుగచేయాలి. పొదుపే తల్లి నేర్పవలసిన మొదటి పాఠము. పిల్లలు ఆహార పదార్థములు విరజిమ్మకుండా, పుస్తకాలు, దుస్తులు కోపం వచ్చినప్పుడు చించి పోగులు పెట్టకుండా తల్లి తగిన జాగ్రత్త తీసుకుంటే చాలు. పెద్ద అయిన తరువాత వారే ఆదాయానికి తగ్గట్లు ఖర్చు చేయటానికి అలవాటు పడుతారు. జీవితం సుఖ శాంతులతో గడుపుకో గలుగుతారు. మాటల కన్న చేతల ప్రభావము ఎక్కువగా వుంటుంది. కనుక పొదుపు విషయంలో తల్లి తండ్రులే పిల్లలకు మార్గ దర్శకులు కావాలి. ఆ నాడు ఆ గృహమే కాదు దేశం కూడా సుఖ శాంతులతో వర్ధిల్లుతుంది.

---

## ఆహార ధాన్యాలను దుబారా చేయకండి

# తెలుగువారి సంగీత ప్రతిభ

**చావలి రామమూర్తి**

(గత సంచిక తరువాయి)

తంజావూరు పాలించిన మహారాష్ట్ర చక్రవర్తులు తెలుగు సంగీత సాహిత్యముల నాదరించిరి. ప్రతాపసింహునికొలువులో వీరభద్రయ్య అనే సంగీత విద్వాంసుఁడు ఆస్థాన గాయకుఁడుగా గౌరవింపబడెను. మధుర, పుదుక్కోట యిత్యాది సంస్థానాధీశు లందరు తెలుగు సంగీత సరస్వతికి నీ రాజనము లిచ్చినవారే.

1793 నుండి 1832 వరకు తంజావూరును శరభోజిమహారాజు పరిపాలన కావించినాఁడు. ఈ కాలముననే, త్యాగరాజు, శ్యామశాస్త్రి, పచ్చిమిరయము ఆది అప్పయ్య, శొంఠి వెంకటరమయ్య, వీణకుప్పయ్యరు, సుబ్బరాయశాస్త్రి వంటి హేమాహేమీలైన కర్ణాటక సంగీత విద్వాంసులు వెలసిరి. తిరువాన్ కూరు రాజన్యులు (1813–47) బహుభాషా వేత్త, సంగీత సరస్వతి నూతన శోభలను చేకూర్చిన కులశేఖర మహరాజు స్వాతి తిరునాళ్ల నామధేయులుగా, ఈ కాలముననే వెలసిరి

వయసుగతింపగా తిరిగి వచ్చిన వారము
దేశ దేశముల్

భయపడనేల? నాఁడులను బట్టి వచింతుము
దేవుడైన రా

మయగుడి లేనిగ్రామమొకటైనను గానము
భక్తుడైన త్యా

గయకృతి లేని గానసభ లెచ్చట గానము
నిక్కు వంబుగన్

పావన భావముల్ తొలగి పైకొన రాగ
రస ప్రవాహముల్

తావులు సూప మిన్నొరసి తాళ తరంగము
లొప్ప లోక సం

జీవని బంధ రామ పద సింధువులో
పరభక్తి మంధర
గ్రామము దిప్పి ముక్తిసుధ గాంచిన త్యాగ
సుధీంద్రు నెన్నెదన్.

అని సుప్రసిద్ధులగు వేంకట పార్వతీశ కవులచే కీర్తింపబడిన కాకర్ల త్యాగయ్య 1759వ సంవత్సరమున తంజావూరు జిల్లాలోని తిరువారూరునందు రామబ్రహ్మము, శాంతమ్మ యను పుణ్యదంపతులకు తృతీయ సంతానముగా నుద్భవించెను. సంగీతత్రయములో ప్రథముండుగా కొనియాడబడుచున్న త్యాగయ్య జీవితాంతము నాదోపాసన కావించిన పుణ్యమూర్తి.

అనేక రాజదర్బారులలో పలుకుబడి గౌరవముబడిసి సంగీత శాస్త్రమునందు అసమాన ప్రతిభాసంపన్నులైన శొంఠివెంకటరమణయ్యగారు త్యాగరాజ స్వామికి గురుపాదులు.

త్యాగయ్య లౌకిక భోగములు లెక్కచేయక తన సంగీత ప్రతిభనుభక్తి మార్గమున శ్రీ రామచంద్రుని కొలుచుటకే వినియోగించిన ధన్యజీవి. ఈతనికి రెండు వివాహములు జరిగినను అవి వంశోద్ధరణకు ఉపయోగపడలేదు.

కర్ణాటక సంగీతమునకు పురందర దాసు విత్తులు నాటి అంకురార్పణ కావించగా, త్యాగరాజు, ముద్దుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి, సంగీతత్రయముగా, నీరు పోసిపెంచి మహావృక్షముగా రూపొందించిరి. వీరిలో మన తెలుగు వారైన త్యాగరాజు, శ్యామశాస్త్రులు సమకాలికులేకాక పరస్పర మైత్రిని కలవారై జీవించిన పుణ్యమూర్తులు.

కర్ణాటక సంగీతము నందు నూతన రాగప్రక్రియలను ప్రవేశపెట్టిన త్యాగయ్య 760 కీర్తనలను రచించెను. అంతేకాక ప్రహ్లాదభక్త విజయము, నౌకా చరిత్రయను యక్షగానములు రచించి 1847 వ సంవత్సరము జనవరి ఆరవతేదీన, సన్యాసాశ్రమస్వీకారము నొందిన పిమ్మట బ్రహ్మీభూతుడైనాడు.

సమస్త దాక్షిణాత్యులచే ఏకోన్ముఖ ప్రశంసలను పొందుచున్న త్యాగయ్యకు తిరువయ్యారులోని ఆయన సమాధివద్ద, వర్ధంతి రోజున గొప్పఉత్సవములు జరుగుచున్నవి ప్రపంచమున ఏదేశము నందున వాగ్గేయ కారులకు పూజాపునస్కారములు లేవు. త్యాగయ్యగారి చిత్తరువును 1916 లో ఆచార్య డాక్టరు రాయప్రోలు సుబ్బారావుగారు తంజావూరు నుండి, కీ. శే. కాశీనాధుని నాగేశ్వరరావు గారి ప్రోద్బలము వలన సంపాదించి తెలుగు జాతికి అందించినారు.

త్యాగరాజ స్వామివారి కీర్తన లన్నియు తమిళ కన్నడ మళయాళ భాషలలోనికి తర్జుమాచేయబడగా, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ (Union Public Service Commission.) లో హిందీ రీసెర్చి ఆఫీసరుగా వ్యవహరించుచున్న డాక్టరు ఇలపావూరి పాండురంగారావు గారు హిందీ భాషలోనికి అనువదించి, ఔత్తరాహులకు త్యాగయ్య గారి ప్రతిభను ఎరుక పరచిరి.

పారిస్‌లో త్యాగయ్య అని 21-5-71వ తేదీన ఆంధ్ర జ్యోతి చిత్ర వార పత్రికవారు ప్రచురించిన దానినిబట్టి శ్రీ ప్రపంచం సీతారాం అను వేణుగాన నిపుణుని కృషివలన త్యాగరాజస్వామి కీర్తనలు 'బేగ్' కంపెనీ వారిచే రికార్డు చేయబడినట్లు, శ్రీ సీతారాం కావించిన వేణుగానసభలో ప్రదర్శించిన దేశపటంలో తెలుగుదేశాన్ని, త్యాగయ్యగారి జన్మస్థలాన్ని గుర్తించి కళలకు కాణాచి అయిన ప్యారిస్ నగరంలో ప్రదర్శించినట్లు చెప్పబడినది ఇది మనకు సంతోషాన్ని గర్వాన్ని కలిగించే వార్త.

త్యాగరాజస్వామి సమకాలికుడు, మిత్రుడు అయిన శ్యామ శాస్త్రి (1763-1827) సంగీతత్రయములో మూడవ వాడు. శ్యామకృష్ణయను ముద్రతో అనేక కృతులు, తానవర్ణములు, నవరత్నమాలికలు కూర్చెను. మాంజి, కలగడ, చింతామణి, అను అపూర్వరాగములు సృష్టించెను. అలచూరి కృష్ణయ్య శాస్త్రి వీరిశిష్యుడు.

మువ్వనల్లూరు సభాపతయ్య (క్రీ.శ. 1767-1847) తంజావూరు జిల్లా నివాసి. త్యాగయ్యకు సమకాలికుడు. క్షేత్రయ్య పదముల ననుసరించి కొన్నిపదములను కూర్చెను.

మేలటూరి వేంకట రామశాస్త్రి (1807-60) భాగవతము నుండి కథలను గ్రహించి 12 యక్షగానములు రచించి గానముచేసిన వాగ్గేయకారుడు. ఈతడును త్యాగయ్యగారి సమకాలికుడే.

క్రీ.శ 1810 నుండి క్రీ.శ. 1900 వరకు జీవయాత్ర చేసిన చెయ్యూరు చెంగల్వ రాయశాస్త్రి గొప్పగాత్ర విద్వాంసుడు.

పురందరదాసు తరువాత గీతావళి రచనలో బహుదొడ్డ మనిషిగా కొనియాడ బడుచున్న పైడాల గురుమూర్తిశాస్త్రిగారు 18వ శతాబ్దమున తిరునల్వేలి జిల్లా కాయతారు గ్రామమున జన్మించి వాసము చేసెను. చతుశ్శాస్త్రపండితుండైన ఈ వాగ్గేయ కారుడు వేయిగీతలు రచించుటచే వేయిగీతి గురుమూర్తిశాస్త్రి అనికీర్తించబడినాడు. శాస్త్రిగారు తంజావూరు ప్రభువులైన తులజీ (1765-87) చే సన్మానింపబడినారు. వీరికి 40,000 రాగ సాంప్రదాయములు తెలుసునని ప్రతీతి. వీరి సోదరుడైన పైడాల సుబ్బయ్యశాస్త్రి కుమారుడైన పైడాల సుందరయ్య కూడా ప్రముఖ సంగీత విద్వాంసులు.

భద్రాచల రాముని కొలిచిన రామభక్తులలో భక్తరామదాసు తరువాత పేర్కొనదగిన తూము నరసింహదాసు 1750 నుండి 1820 వరకు జీవితము చేసెను. ఈ భక్తాగ్రశిఖామణి గొప్పకీర్తనాకారుడై తోడి, కాకభోజి, ఎరుకుల యిత్యాది రాగముల తాను దర్శించిన క్షేత్రపాలకులపై కీర్తనలు కూర్చి కీర్తిపథము నొందినాడు. నరసింహదాసు గుంటూరుజిల్లానివాసి. ఈతని తల్లిదండ్రులు మంగళగిరి నరసింహస్వామి భక్తులు. తనరాగములందీతడు హిందూస్థానీ బాణీరాగములుకూడ చేర్చిపాడెను. త్యాగరాజస్వామిని దర్శించిన పుణ్యాత్ముడు. భద్రాచలమున భక్తరామదాసు వదలిన పనులు పూర్తిచేసెను.

వినువారికి, పాడు వారికిని అమితానందోత్సవములు కలుగ చేయుచు భక్తివైరాగ్యములను, ప్రేమాభిమానములను ఉద్భవింపచేయు చున్న అధ్యాత్మ రామాయణ కీర్తనలను తెలుగు భాషలో కూర్చిన మహనీయుండు మునిపల్లిసుబ్రహ్మణ్యకవి. కృష్ణా జిల్లా నివాసి అయిన యీ వాగ్గేయ కారుడు 1730 నుండి 1780 వరకు జీవించి 104 కీర్తనలు కూర్చెను. కృష్ణా జిల్లాలో గల మునిపల్లె ఈతని స్వగ్రామము.

భక్తివైరాగ్యముల యందు వాగ్గేయకార నైపుణ్యమునందు, క్షేత్రయ్య, అన్నమయ్య, త్యాగయ్యల కోవకు చెందిన అల్లూరు వేంకటాద్రిస్వామి 1807 వ సంవత్సరమున కృష్ణాజిల్లాలోగల అల్లూరను గ్రామమున జన్మించెను. తూమునరసింహదాసుశిష్యుడు అనేక క్షేత్రములు దర్శించి, ఆ క్షేత్రపాలకులపై కీర్తనలు కూర్చెను. జీవిత అస్తమయ సమయమున సన్యాసము స్వీకరించి శ్రీరంగేశ్వరుని వేనోళ్ల కీర్తించి తిరువేంగడ రామన జీజీరను నామముతో 1877 వ సంవత్సరమున సమాధి చేరెను.

1850 వ సంవత్సర ప్రాంతము ఉత్తర ఆర్కాటుజిల్లాలోని పోలూరుగ్రామమున జన్మించిన అచ్చియ్యనాయుడను రామభక్తుడు, భజన కీర్తనలు రచించి ఒంటరిగా కూర్చొని పంట పొలములందు మనోల్లాసముగా కీర్తనలు పాడుకొనువేళ, పశువులు మేత మేయుట మరచి ఆతని కీర్తనలు ఆలకించు చుండెడివట. అంత్యమున సన్యాసము స్వీకరించి అచ్యుతానందుడను పేరుతో 1902 వ సంవత్సరమున సమాధిని చేరెను.

బొబ్బిలి కేశవయ్యఅను సంగీత విద్వాంసుడు, అనేక మంది వాగ్గేయ కారుల నోడించి తంజావూరును శరభోజి మహరాజు పాలించుచున్న కాలమున అచ్చట కేగి బహుసన్మానములు బడసెను.

ఫిడేలు వాయిద్యమున ఘనుడైన సుబ్బరాయశాస్త్రి (1803-62) శ్యామశాస్త్రికుమారుడు తొలుత తండ్రివద్దను తర్వాత త్యగరాజస్వామి వద్దను శుశ్రూష చేసిన ఈతడు తమిళాది దక్షిణ సాహిత్యముల యందు గీరాణ భాషయందు పండితుడై కుమార అను ముద్రతో స్వరజతులు, చిట్టి స్వరములతో కృతులను కూర్చెను. ఈ ధన్యజీవి, అన్నస్వామి శాస్త్రి, కంచి కామశాస్త్రి, పట్నము సుబ్రహ్మణ్యము, చిన్నస్వామి దీక్షితులు, ముత్తుస్వామి దీక్షితుల వంటి దిగ్దంతులకు గురువుగా భాసిల్లెను.

చేడ రాగమునందు అసమాన ప్రజ్ఞగాంచిన పట్నము సుబ్రహ్మణ్య అయ్యరు (1846-1902) సంస్కృతాంధ్ర తమిళాది బాషలలో కోవిదుడు. అనేక కృతులను గూర్చిన ప్రతిభా సంపన్నుడైన వాగ్గేయకారుడు.

సేలంజిల్లా వాస్తవ్యుడై గొప్ప పల్లవిపాటకుడుగా కీర్తి గాంచిన పల్లవి శేషయ్యరు (1846-1908), త్యాగరాజస్వామి శిష్యులైన సుబ్బయ్యరు కుమారుడు. కర్నాటక సంగీతమునకు నూతన శోభను కూర్చిన పుణ్యమూర్తి.

తచ్చూరు సింగరాచార్యుడు 1834నుండి1892 వరకు జీవించిన గొప్ప సంగీతవిద్వాంసుడు. సంస్కృతాంధ్రములందు పండితుడు.

కీ. శే. సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిగారు. దక్షిణ దేశమునకు వెళ్ళి తిరువయ్యూరులో త్యాగరాజస్వామి శిష్యులైన మానం జావడి సుబ్రహ్మణ్య అయ్యంగారివద్ద సంగీతసర్వస్వమును ఆరాధించి కృష్ణాజిల్లాలోగల పెద్ద కళ్ళేపల్లి గ్రామమును వాసము చేయుచు, అనేకులకు సంగీతవిద్యా దానమొనర్చిరి. గాయక సార్వభౌమ బిరుదాంకితులైన పారుపల్లి రామకృష్ణయ్యగారు వీరి శిష్యులే. ప్రస్తుతము చలనచిత్ర రంగమున సంగీత దర్శకులుగానున్న శ్రీ సుసర్ల దక్షిణామూర్తిగారు, దక్షిణామూర్తి శాస్త్రిగారి పౌత్రులే. శాస్త్రిగారు 1922లో ఈశ్వర సాన్నిధ్యము చేరిరి.

తెలుగు దేశమున వెలసిన, బొబ్బిలి, విజయనగరము, పిఠాపురము, నూజివీడు, వేంకటగిరి, కాళహస్తి, కార్వేటి నగరము గద్వాలు, వనపర్తి, ఆత్మకూరు, ఇటవోలు, యిత్యాది జమీందారీలన్నియు సంగీత సాహిత్యములను పోషించి, గాయకులను వైణికులను, కవులను సన్మానించి ఆదరించినవే.

అభినవాంధ్ర భోజుడని ఖ్యాతిగాంచి. సాహిత్యాదిసమస్త కళలను పోషించిన విజయనగరము జమీందారులగు శ్రీ పూసపాటి ఆనందగజపతి ప్రభువరేణ్యుని ఆస్థానమున దేశ విదేశములనుండి వచ్చిన సంగీత విద్వాంసులు ఆదరింపబడుచుండిరి. అట్టివారిలో మిన్నగా చెప్పుకొన వలసిన వారిలో, వీణా వేంకటరమణ దాసుగారొకరు.

వీణా వేంకట రమణదాసు ప్రఖ్యాతిగాంచిన వైణిక విద్వాంసుడు. వీరి యింటిపేరు గురాచార్యులవారు. ఈతడు 1866–1944 వరకు జీవించినాడు. ఈతడు బరోడా యిత్యాది రాజ్యాధినేతలచే తరచుగా గౌరవింపబడెను. కర్జను ప్రభువు సమక్షమున వీణావాయిద్యము చేసి, ఆ తెల్లదొరను ఆశ్చర్య చకితుడుగాచేసి సువర్ణ పతకమును పొందినవాడు. ఆనంద గజపతికి గురువు.

తెలుగుదేశమున, సంగీత, సాహిత్య, నృత్యనాట్యములందు అసమానమైన అభినివేశము కలిగి, తెలుగుభాషామతల్లికి కళామతల్లికి అనన్య సామాన్యమైన సేవచేసి, బహుభాషా వేత్తగా సరసుడుగా, రసజ్ఞుడుగా కీర్తిగాంచి అన్నమయ్య, త్యాగయ్యల కోవకు చెందిన కీ. శే. ఆదిభట్ల నారాయణదాసుగారు 1864వ సంవత్సరము ఆగస్టు 31వ తేదీన శ్రీకాకుళముజిల్లాలోగల అజ్జాడ అను గ్రామమున జన్మించిరి. బాల్యమున, ఇంటివద్దనే విద్యాభ్యాసముచేసి తదుపరి సంస్థాన విద్వాంసులుగానున్న వాసా సాంబయ్య గారివద్దను, విజయ నగరములోనున్న వీణా వెంకటరమణ దాసుగారి వద్దను సంగీతవిద్య నభ్యసించెను.

నృత్యముచేయుచు, సంగీతసాధన సహాయమున వివిధ సాహిత్య ప్రక్రియలను ప్రదర్శించుచు, హరికథాగానము చేయు పద్ధతిని దాసుగారే ప్రథమమున సృష్టించిరి. ఆంధ్రము, ఆంగ్లము, సంస్కృతము, పారశీకములలో పాండిత్యము కలిగిన దాసుగారు, షేక్స్పియరు, మిల్టను కవులనుండియు, కాళిదాసు భవభూతులనుండియు, విషయముల నుల్లేఖించుచు హరికథాగానము చేసెడివారు. రవీంద్రునికి దాసుగారు సుపరిచితము.

యావత్ భారతమును దర్శించి, మైసూరు మొదలైన రాజ్యాధినేతల మెప్పువడిసి, ఆనంద గజపతి ఆస్థాన విద్వత్ కోటిలో సభ్యులై, 1919వ సంవత్సరమున విజయనగరములో స్థాపించబడిన సంగీత కళాశాలకు అధ్యక్షులైరి.

H.R. బార్డ్సు వెల అనునొక పాశ్చాత్య I.C.S. ఉద్యోగి దాసుగారి సంగీత ప్రతిభను వేనోళ్ల కొనియాడుచు, నోబుల్ బహుమతి గ్రహించుటకు కర్హుడని పలుకుచు "I believe the prize is awarded to some one of world-wide fame and you can really claim to have that" అని వ్రాసెను.

దాసుగారికి 'ఆటపాటల మేటి' అను అచ్చతెలుగు బిరుదము కలదు. వీరి ప్రతిభను కొనియాడుతు శ్రీశ్రీ.

"హరికథా పితామహుడగు

ఆదిభట్ల దాసు

సంగీతము, సాహిత్యము

సరితూచిన త్రాసు" అని శ్రద్ధాంజలి ఘటించెను.

స్వపరజనులచే 'ఓహో' అనిపించుకొని దాసుగారు 1945వ సంవత్సరము జనవరి రెండవ తేదీన ఈశ్వర సాన్నిధ్యము చేరిరి.

నారాయణ దాసుగారితో కలిసి పేరి రామమూర్తి శాస్త్రిగారను వైణికు లొకరు, గొప్పవిద్వాంసులను ఖ్యాతిగాంచి, సభలలో పాలొనెడివారు. వీరికి విశేషమైన శిష్యవర్గము కలదు. వారిలో నొకరైన ఆదిరాజు నరసింహమూర్తిగారును, అనేకమందికి సంగీతవిద్యాదానము చేసిరి. శ్రీ మంచాళ జగన్నాధరావు గారు వీరి శిష్యులే. ఉత్తరాంధ్రమున ఈ సమయమున పేర్కొందగు రామమూర్తి గారను విద్వాంసుడు, కర్ణాటక సంగీతాభివృద్ధికి విశేషమైన కృషిసల్పి పలువురు శిష్యులను తయారుచేసెను.

ఇరువదవ శతాబ్దమున తెలుగు దేశమున నుద్భవించిన వైణిక విద్వాంసులలో తుమరాడ సంగమేశ్వర శాస్త్రి (1874–32) గారొకరు. బొబ్బిలి సంస్థాన సంగీత విద్వాంసులైన నందిగామ వెంకయ్య (1859–1906) గారి శిష్యులు. పిఠాపురం సంస్థానమున ఆస్థాన వైణిక విద్వాంసులుగా గౌరవింపబడిరి.

1919వ సంవత్సరమున విశ్వకవి పిఠాపురము వచ్చినారు. శాస్త్రిగారు సంగీత కచేరి చేసినారు. తర్వాత "నేను దక్షిణదేశమంతా తిరిగి అనేక విద్వాంసుల సంగీతము విన్నాను. నాకు సంగీతమంటే వెర్రిఅన్న సంగతి మీకు తెలుసుగదా! వారందరూ మహా విద్వాంసులే. అందుకు సందేహము లేదు. ఒక్కొక్కరిలో ఒక్కొక్క విశేషమున్నది, తప్పకుండా. కాని ఎవ్వరు నా హృదయాన్ని కరిగింప లేకపోయారు వీరిలా. వీరి వాయిద్యము వినుటతోనే వారిని నా గురువుగా గుర్తించాను." అని శ్లాఘించినారు.

(తరువాయి 16 వ పుటలో)

# బంగ్లా తరంగాలు

ఎక్కడైనా ఎప్పుడైనా విన్నారా ఇలాంటి దురంతం
నాకు తెలియక ప్రశ్నిస్తున్నాను
చారిత్రకుల్నీ పౌరాణికుల్నీ సార్వభౌముల్నీ మతస్వాముల్నీ

అనంతకాల చరిత్రని తవ్వి
పురాణకల్పనల్ని పుక్కిలించి
సామ్రాజ్య దాహాల్ని స్మరించుకుని
గతమతోన్మాదాన్ని తల్చుకుని
చెప్పండి-విన్నారా ఇలాంటి దురంతరం?

నర రక్తాన్ని గుమ్మరిస్తూ నవ్విందెవరు
పరభాషావ్యాప్తిలో ఏడుస్తూ పరవశించిందెవరు
శారదాలయాల్లో శవోత్సవాల డప్పులు కొట్టించిందెవరు
పాకశాలల్లో తుపాకులికి విందు పెట్టిందెవరు

ఈ శ్మశానీకరణానికి ఆజ్ఞలు జారీ చేస్తున్నదెవరు
ఈ రుజాబీజాలు చల్లించే కుష్ఠ రోగి ఎవరు

పత్రికల తలలు వార్తలతో మండిపోతున్నాయ్
మనిషి గుండెల్లో మరతుపాకులు పేలుతున్నాయ్
కత్తులు ఏకోదరుల్ని నరుకుతున్నాయ్
మిత్తులు కీచకోన్మాదాల్ని తలపెడుతున్నాయ్
ఇక నేను వినలేను
ఆపండయ్యా ఈ శోచనీయ గర్హణీయ రాజకీయాల్ని
నియంతృత్వ ఫణాలెత్తి బుసగొట్టే కాకోదరాల్ని

స్వపరిపాలనాచ్ఛత్రం వేసుకోదలచిన వివేచన మీద
పగ ఎందుకంటే-ఏముంది-అసహనం
అయితే ఏడు కోట్ల మంది ఎదురు తిరిగి
హక్కుల పొలిమేరలు కాపాడుకునే సంరంభంతో
గాఢాంధకారాన్ని కత్తిరిస్తారు
సాగర తరంగాల్ని సాయ మడుగుతారు.

మేలుకుని ఉన్న మానవజాతికి అనుగుతమ్ములై
ఆత్మబలమొక్కటి వాళ్ళ వెలుగు జెండా అయి
వాళ్ళు చేసే జైత్రయాత్రలో
వేసుకుంటారు ఎన్నెన్నో స్వేచ్ఛల ఆనవాళ్లు

తిమిరంకొమ్మల్ని విరిచి వివేచనా కవచాల్ని ధరించి
వాళ్ళకు సాయంగా వచ్చేది మానవులు జ్వలద్రవులు
పరాభవాల కూపాల్లో పడి పైకి రావడానికి యత్నిస్తున్న
అరుస్తున్న జీవాలకి కరావలంబన మిచ్చేది కరుణాళువులు
అడవుల్లో కొండచిలవల నోళ్ళలో చిక్కుకుని
చావు బతుకుల పోరు సాగించే వీరుల్ని ప్రోత్సహించేది ధీరులు

ఎవరైనా ఇంకా సంకోచిస్తున్నారా, ప్రళయం తెస్తున్నారు
ఎవరైనా ఇంకా మౌనంవహిస్తున్నారా, మరణాన్ని పిలుస్తున్నారు
ఎవరైనా మీనమేషాలు లెక్కిస్తున్నారా, కత్తు లందిస్తున్నారు
ఎవరు ఎవరు ఉపేక్ష వహిస్తున్నారు
ఎందుకు ఎందుకు మంచితనం కోసమా
కాదది మంచితనం, మారణాస్త్రాల్లో దాచిన ధనం

పీడకలల పురుగులు చుటూ చేరి
మృత్యువృశ్చికాలు విషం కురిసి
హింసావృకాలు దంష్ట్రల్ని విప్పి
ఇప్పుడు చంపుతున్నది మనుషుల్నేకాదు
స్వాతంత్ర్యాన్ని ప్రజాస్వామ్యాన్నీ కూడా.

విమానాల నీడల కింద శతఘ్నుల మోగులు
శతఘ్నుల గుట్టల కింద శవాల లక్షలు
శవాల సమూహాల పక్క ఆర్తరవాల తరంగాలు
భిషక్కు దొరకని చోట విలువలేని చిక్కని కొత్త నెత్తురు
నెత్తుర్లో కలిసిపోతున్న కక్కు
ఎగిరిపోతున్న బతుకు హక్కు

ఎవడురా వాడు
దేశమాత ధవళాంశుకం మీద
శిశు రక్తాన్నే రంగుగా పూసేస్తున్న ఉన్మాది
ఎవడురా వాడు
సోదరుల మనోరథాల్ని పడగొట్టి
అధికార మందిర స్తంభాల్ని లేవగొడుతున్న ప్రమాది
ఎవడురా వాడు
కేదార కామధేనువుల పొదుగుల మీద
కిరాతక కాముక హంతక చర్యల్ని జరిపించే చతుష్పాది
ఎవడురా వాడు
బంగారు బంగ్లా జల్తారు చీరని లాగేస్తున్న దుశ్శాసని

ఆ నెత్తుటి కెంపుల్లోంచి పెనుమంటల్లేచి
ఆ కూలే కోరికల్లోంచి సింహ కిశోరాలుద్భవించి
ఆ నేల గుండెలో కంపాలు పుట్టి
ఆ పయిట కొంగు మెరుపులోంచి సుదర్శనం లేచి
వాణ్ణి గంగలో కలుపుతుందని చెప్పుకుంటున్నాయి దిక్కులు.

ఆ పెను తుఫానులో కొత్త కెరటాలు లేచి
పౌరుష గగనాల్ని తాకి
అణ్వస్త్రాల పిచ్చి నవ్వుల్ని వెక్కిరిస్తాయ్
అధికారాజ్ఞల వెర్రిచూపుల్ని ధిక్కరిస్తాయ్

ఆ తరంగాల అంచుల మీద కనిపిస్తోంది
స్వేచ్ఛా స్వచ్ఛ నవ వంగావని
ఆ తరంగాల కొసల మీద వినిపిస్తోంది
ప్రగతి ప్రపంచ రోమాంచ ధ్వని.

మిరియాల రామకృష్ణ

# కలిసి పయనించటం లాభదాయకం!




మీరు ఒక గుంపుగా ప్రయాణం చేస్తే ఎయిర్-ఇండియా వారి ఎఫినిటీ గ్రూప్ స్కీము క్రింద తక్కువ, చాలా తక్కువ చార్జీలు చెల్లించవలసి ఉండును.

## ఎటువంటి గుంపులు ఇందుకు అర్హులు ?

మీ గుంపులో కనీసం 15 మంది సభ్యులైనా ఉండాలి. మీరంతా కనీసం 6 మాసాల పాటైనా ఒకే స్కూలు/కాలేజి, ఇన్‌స్టిట్యూట్, ఫర్మ్, క్లబ్, సొసైటీ, కార్పొరేషన్, అసోసియేషన్ లేక సమాఖ్యకు చెందినవారై ఉండాలి.

## ఎటువంటి ప్రయోజనానికి ?

ఒక కాన్ఫరెన్స్ లేక కన్వెన్షన్‌కు హాజరవ్వటానికి గాని లేక కులాసా కోసం గాని మీరు ప్రయాణం చెయ్యదలచినట్లైతే మీకా తగ్గింపు సదుపాయం లభించగలదు. ఎయిర్—ఇండియా మీ గుంపులో భాగముగా మీ భార్య/భర్త మరియు పిల్లలను గూడా చేర్చటానికి అంగీకరించగలదు. నిజంగా మీరు ఎంతో డబ్బు—కొన్ని సెక్టర్లలో ఒక్కొక్క ఛార్జీ మీద రు. 2000 లకు పైగా—ఆదా చేసుకోగల్గుతారు.

జీవితిని గురించి మీ ట్రావెల్ ఏజెంటును సంప్రదించండి. గ్రూప్ ఇంక్లూజివ్ టూర్ స్కీము క్రింద కలిసి ప్రయాణం చేసే 10 మంది గల గుంపుకు విమాన ఛార్జీలలో, హోటల్ బుక్కింగులలో, వివిధ ప్రదేశాలను చూడటానికి ఏర్పాటు చేసిన టూర్లలో తక్కువ రేట్ల ప్రయోజనం మీకు లభిస్తుంది. మీ ట్రావెల్ ఏజెంటు 21-రోజుల యూరపు పర్యటనను కేవలం రు. 5,600లకు మాత్రమే ఏర్పాటుచేయగలడు.

మీ స్థానిక ఎయిర్-ఇండియా ఆఫీసు లేక మీ ట్రావెల్ ఏజెంటును పూర్తి వివరాలకై సంప్రదించండి. కలిసి ప్రయాణం చేయటం ఎంతో లాభదాయకమని మీరు తెలుసుకోగల్గుతారు.

**ఎయిర్-ఇండియా**

మిమ్మల్ని ప్రేమించే ఎయిర్‌లైన్

# నాడు-నేడు

—ఉత్పల సత్యనారాయణాచార్య

చాల విలువైన నీదగు కాల మింత
వ్యర్థ మొనరింపఁబోకు మవ్యాజముగను
నీదు పూర్వుల జీవన నియతి దలఁచి
అలవరచుకొమ్ము నీ వుత్తమాభిరుచులు

ఔర ! యువకుల చలనచిత్రాలయములఁ
జీట్లకై ప్రాకులాడు నిక్కట్లు చూడు
లేదె వారికి మంచి వినోద మొకటి
పూర్ణ పూరుష కీర్తి నింపునది యొకటి

సంజవేళల గృహగవాక్షములనుండి
వీణియల నిక్వణములు విన్పించవేమి ?
బాలకులు బహు వ్యాయామ ఖేలనముల
ఘన జయమ్ములకై పూనుకొన రదేమి ?

మధుర శిల్పమ్ములేవి, యామధురమైన
తంజనగర సంగీత నృత్యమ్ము లేవి ?
మరల నా వైభవమ్మేల తిరిగి రాదొ ?
సుంత యోచించినాఁడవా సోదరుండ !

శౌర్య శోభితులగు బాల చంద్రు లేరి ?
న్యాయ విదులగు నల బ్రహ్మనాయు లేరి ?
మంత్రి మాణిక్యములగు తిమ్మరుసు లేరి ?
నాటి మాంచాల సమ వీరనారు లేరి ?

కదనవీరులు ఖడ్గతిక్కన్న లేరి ?
అరి భయంకర వీర రుద్రాంబ లేరి ?
రమ్యకవయిత్రి రామభద్రాంబ లేరి ?

మరల మనగడ్డమీఁద జన్మంబునొంది
క్రాలునట్టె ? తిక్కనవంటి కవి యొకండు ?
మరల వుట్టున ? మందార మధుర మంజు
భావములఁ తేలు పోతన్నవంటి సుకవి :

తెలుగు మాగాణి త్యాగయ్య దివ్యగీత
రాగ లహరులచే రసాప్లావమయ్యె
తనిసి యెంత ఉబ్బూఁతలూఁగినదొ జగము !
అపుడు పరమాత్మఁడెంత తృప్తిపడినాఁడొ !

మానవాళికి నర్థకామములు రెండె
ధ్యేయములునైన శాంతి వర్ధిల్లఁబోదు
దాని వికృతియం దధికసంతాన మొకటి
దాని ఫలితమ్ము దారిద్ర్య దశయు నొకటి

చదువులు విపరీతజ్ఞాన జన్యకములు
బుద్ధులు నిరంతరార్థకామోద్ధురములు
వేషభాషలు వైజాత్య విభ్రమములు
వృత్తులు పరార్థవంచనావిలసితములు

ఋతునియతి లేదు మంగళప్రతము లేదు
వాంఛితావాప్తి కొక హద్దు పద్దు లేదు
నరుఁడు మింటికి నెక్కుచున్నాఁడొ ! లేక
తాను దిగుచున్నవాఁడొ ! పాతాళమునకు

హృదయమున వాచికమున శరీరమందుఁ
దుకతుక నుడుకునట్టి మాదకత గాని
తెల్లనయి చల్లనైన సాత్వికత లేదు
హాయిగొల్పెడు సౌమనస్యంబు లేదు

ఆశ్రమములన్ని తాఱుమాఱైనయపుడు
పుడమి గార్హస్థ్యమున ధర్మముడిగినపుడు
బ్రహ్మచర్యంబు నపహాస్యభాజనంబు
నైనయప్పుడు సంప్రదాయం బదెల్ల

కలుషమై నీతిపథమడు గంటినపుడు
అతిప తానొక్క యాట బొమ్మైన యపుడు
జాతి సంస్కృతియెల్లను జాఱినపుడు
కోయిలలు చచ్చి యంత్రాలు కూయునపుడు

పంటకాల్వల ముఱుగులు పాఱునపుడు
భోగభాగ్యాల బలిసిన నాగరికత
వికృతమగుచు వెఱ్ఱితలలు వేసినపుడు
ఓడువాఱిన చేల జిల్లేడు చెట్లు
వెలసి మొదలంట పిందెలు వేయఁగలవు
నాగజెముడులు నిన్ను వెంటాడఁగలవు.

# ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం

## కాబినెట్ మంత్రులు:

ముఖ్యమంత్రి

**శ్రీ పి. వి. నరసింహారావు**

ఉపముఖ్యమంత్రి

**శ్రీ బి. వి. సుబ్బారెడ్డి**

**శ్రీ తోట రామస్వామి**
పంచాయతీరాజ్, పంచాయతీలు, చిన్న మొత్తముల పొదుపు,

**శ్రీ కాకాని వెంకటరత్నం**
వ్యవసాయం, ఆహారోత్పత్తి, పశుగణాభివృద్ధి, సమీకృత పాలప్రాజెక్టు, పాడిక్షేత్రాల అభివృద్ధి.

**శ్రీ యన్. చెంచు రామానాయుడు**
చేనేత పరిశ్రమ, సహకార జవుళి మిల్లులు, సహకార చక్కెర ఫ్యాక్టరీలు.

**శ్రీ కె. అచ్యుత రెడ్డి**
రెవిన్యూ, రిజిస్ట్రేషను, స్టాంపులు, నిర్వాసుల ఆస్తులు, అతియత్, జాగీరు పరిపాలన, ఋణపరిష్కార సంఘం.

**శ్రీ జె. చొక్కారావు**
పరిశ్రమలు.

**శ్రీ యస్. సిద్దారెడ్డి**
నీటి పారుదలశాఖ. (చిన్నతరహా, మధ్యతరహా నీటిపారుదల, డ్రైనేజి, వరద నివారణ విషయాలుమినహా.)

**శ్రీ మహమ్మద్ ఇబ్రహిం అలీ అన్సారీ**
వైద్య, ఆరోగ్యశాఖ, వక్ఫులు, వక్ఫుబోర్డు, సాలార్ జంగ్ మ్యూజియం.

**శ్రీ ఆర్. రామలింగరాజు**
ధర్మాదాయ, దేవాదాయ సంస్థలు.

**శ్రీ ఎ. భగవంతరావు**
ఆర్థికశాఖ, పునరావాసం, జైళ్లశాఖలు.

**శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు**
విద్యుచ్ఛక్తి, స్టేషనరీ, ప్రింటింగ్ శాఖలు

**శ్రీ యం. మాణిక్ రావు**
మునిసిపల్ పరిపాలన, టౌన్ ప్లానింగు, వాణిజ్యం. ఎగుమతుల ప్రోత్సాహం, రేవులు.

**శ్రీ బి సుబ్బారావు**
సహకారశాఖ

**శ్రీ సి. హెచ్.యస్.ఆర్.వి.పి. మూర్తిరాజు**
మార్కెటింగు, రాష్ట్ర వేర్ హౌసింగ్ సంస్థ, అగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్.

**శ్రీ పి. ఒసిరెడ్డి**
మధ్య తరహా నీటి పారుదలశాఖ, డ్రైనేజి, వరద కంట్రోలు, న్యాయశాఖ, కోర్టులు.

## స్టేట్ మంత్రులు

**శ్రీ ఎ. వాసుదేవరావు**
సమాచార పౌరసంబంధశాఖ, చిన్నతరహా నీటి పారుదలశాఖ

**శ్రీ సి. రాజనరసింహ**
గృహనిర్మాణ శాఖ, గృహవసతి శాఖ, స్పోర్ట్స కౌన్సిలు క్రీడలు, స్టేడియం.

**శ్రీ చల్లా సుబ్బారాయుడు**
సివిల్ సరఫరా, రేషనింగు

**శ్రీ పి. మహేంద్రనాథ్**
అటవీశాఖ

**శ్రీ కె. గోపాలనాయుడు**
రవాణాశాఖ

**శ్రీ కె. భీంరావు**
గిరిజన సంక్షేమశాఖ

**డా. సి. హెచ్. దేవానందరావు**
యాత్రా వ్యవహారాలు, రవీంద్రభారతి, రాష్ట్రాన్ని సందర్శించే సాంస్కృతిక ప్రతినిధి వర్గాలు.

**శ్రీ ఎ. మదనమోహన్**
సాంకేతిక విద్యాశాఖ, పబ్లిక్ గ్రంథాలయాలు, యువజన సేవలు.

**శ్రీమతి పద్మా భాస్కరరెడ్డి**
మహిళా సంక్షేమం, శిశు సంక్షేమం, గనులు, మైనింగ్ కార్పొరేషన్.



ముఖ్యమంత్రి ప్రమాణ స్వీకరణ

# ఆంధ్రప్రదేశ్ నూతన మంత్రివర్గం



**శ్రీ పి. వి. నరసింహారావు**
ముఖ్యమంత్రి

సాధారణ పరిపాలన శాఖ, సర్వీసులు, శాసన సభ వ్యవహారాలు, సాధారణ విద్య (సాంకేతిక విద్య మినహా) అర్థ శాఖ, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, అకాడమీలు, మ్యూజియంలతో సహా సాహిత్య, శాస్త్రీయ విజ్ఞాన సంస్థలు, వ్రాసిన ప్రతుల సంరక్షణ, వాటి భాషాంతరీకరణ, సాహిత్య వేత్తలకు ఆర్థిక సహాయం, ఆధునిక భారతీయ భాషల అభివృద్ధి, పురావస్తు సంచయన శాఖ, ప్రాంతీయ, చారిత్రిక పరిశోధన మరియు రికార్డుల కమిటీ, సాంస్కృతిక వ్యవహారాలు, అధికార భాష, మత్స్య పరిశ్రమ, వాణిజ్య పన్నులు, ఎక్సైజు, హోం, పోలీసు, ఆయుధాల చట్టం, పాస్‌పోర్టులు, సినిమాటోగ్రఫీ, ఎన్నికలు, కార్మిక వ్యవహారాలు, సాంఘిక సంక్షేమం.

**శ్రీ బి. వి. సుబ్బారెడ్డి**
ఉపముఖ్యమంత్రి

ప్రణాళికలు, ఆర్థిక గణాంక శాఖ, భవనములు, రోడ్లు, జాతీయ రహదారులు, పబ్లిక్ గార్డెన్స్, నగర నీటి సరఫరా, పి. డబ్ల్యు. డి. వర్క్‌షాపులు, రైల్వేలు టెలిగ్రాఫ్‌లకు సంబంధించిన వ్యవహారాలు.





ఉపముఖ్యమంత్రి ప్రమాణ స్వీకరణ



శ్రీ తోట రామస్వామి
పంచాయతీరాజ్, పంచాయతీలు,
చిన్న మొత్తముల పొదుపు.

# మన మంత్రులు

## వారు నిర్వహించు శాఖలు



శ్రీ జె. చొక్కారావు
పరిశ్రమలు.

శ్రీ అనగాని భగవంతరావు
అబ్కారి, పునరావాసం, జైళ్ళు.



శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు
విద్యుచ్ఛక్తి, స్టేషనరీ, ప్రింటింగ్ శాఖలు.



శ్రీ యం. మాణిక్‌రావు
మునిసిపల్ పరిపాలన, టవున్ ప్లానింగ్, వాణిజ్యం,
[illegible] ప్రోత్సాహం, రేవులు.





శ్రీ అక్కిరాజు వాసుదేవరావు
సమాచార పౌరసంబంధ శాఖ,
చిన్నతరహా నీటిపారుదల శాఖ.



శ్రీ సి. రాజనరసింహ
గృహనిర్మాణ శాఖ, గృహవసతి, స్పోర్ట్స్ కౌన్సిల్,
క్రీడలు, స్టేడియం.



శ్రీ పల్లా సుబ్బారాయుడు
సెరికల్చర్, రేషనింగు.



శ్రీ పి. మహేంద్రనాథ్
అటవీశాఖ.



శ్రీ కె. గోపాల నాయుడు
రవాణాశాఖ.



శ్రీ కె. భీమ్‌రావు
గిరిజన సంక్షేమ శాఖ

డా. సి. హెచ్. దేవానందరావు
యాత్రావ్యవహారాలు, రవీంద్రభారతి,
రాష్ట్రాన్ని సందర్శించే సాంస్కృతిక
ప్రతినిధివర్గాలు.



శ్రీ ఎ. మదనమోహన్
సాంకేతిక విద్యాశాఖ, పబ్లిక్ గ్రంథాలయాలు,
యువజన సేవలు.



శ్రీమతి పద్మా భాస్కరరెడ్డి
మహిళా సంక్షేమం, శిశుసంక్షేమం,
గనులు, మైనింగ్ కార్పొరేషన్.



# మహాభారతము

తెలుగు గంటల లక్ష్మణశాస్త్రి

## 51

### క్షత్రియ ప్రభావము

"బ్రాహ్మణులు—క్షత్రియులు ఇరువురు కలిసినచో శత్రువులను, అగ్ని వాయువులు కలిసి అడవిని దహించినట్లు దహించగలరు. రాజు ధర్మస్వరూపుడు, అతడే ప్రజాపతి (సృష్టికర్త) ఇంద్రుడు, శుక్రాచార్యుడు, బ్రహ్మ బృహస్పతి యగును. రాజు 'ప్రజాపతి, విరాట్ స్వరూపుడు, చక్రవర్తి' మొదలగు శబ్దములతో స్తోత్రము చేయబడినప్పుడు అతని పూజను ఎవరు చేయరు? "పురాయోని (పథమ కారణుడు), యుధాజిత్ (యుద్ధములో విజయశీలి), అభియా (రక్షించుటకొరకు అంతట తిరుగువాడు), ముదిత (ప్రసన్నుడు), భవ (ఈశ్వరుడు), స్వర్ణేతా (స్వర్గమును చేర్చువాడు), సహజిత్ (తత్క్షణమే విజయమును పొందువాడు), బభ్రు (సర్వవ్యాపకుడగు విష్ణువు)" అను నీపేర్లతో రాజు వర్ణింపబడుచున్నాడు. రాజు సత్యమునకు కారణుడు, సమస్త వార్తలను తెలియువాడు, సత్య—ధర్మములను లోకములో ప్రవర్తింపజేయువాడుగాను నుండును. అధర్మమునుండి భయపడు మహర్షులు ధర్మరక్షణార్థమై తమ బ్రహ్మతేజస్సును గూడ క్షత్రియులయందు స్థాపించియున్నారు. ఆకాశమునందు సూర్యుడు తన తేజస్సుచేత అంధకారమును పోగొట్టునట్లే రాజు భూమియందు తన పరాక్రమముచేత అధర్మములను పోగొట్టుచున్నాడు. పై కారణములచేతను, శాస్త్రప్రమాణములచేతను రాజునకు ప్రాధాన్యము గలదు. కనుక ఎవడు రాజును 'ప్రజాపతి' యని స్తుతించెనో యతని పక్షమే గెలిచెను.

"అత్రి పక్షము ఉత్కృష్టమని సనత్కుమారుడు నిర్ణయించినట్లు తెలిసిన తరువాత పృథుచక్రవర్తి సంతుష్టుడై అత్రి మహామునితో నిట్లనెను:—'మహర్షీ! మనుష్యులలో నేను శ్రేష్ఠుడనని నీవు చెప్పినమాట సర్వదేవ సమ్మతమైనది. కనుక నీకు నేను వివిధ ధనములను పుష్కలముగా నిచ్చెదను. వస్త్రభూషణములతో నలంకరించబడిన సహస్ర సుందర దాసీజనమును, పది కోట్ల బంగారు నాణెములను, పది మణుగుల బంగారమును సర్వజ్ఞుడవగు నీకు ఇచ్చెదను. అంతట అత్రి మహాముని న్యాయముగా తనకు లభించిన ఆ ధనములను స్వీకరించి తన యింటికి తిరిగిపోయి ఆ ధనమునంతయు పుత్రులకు పంచియిచ్చి తపశ్చర్యకొరకై వనమునకు పోయెను" అని మార్కండేయ మహాముని పాండవులకు బ్రాహ్మణ ప్రభావమునుగూర్చి చెప్పి 'ఈ విషయములోనే తార్క్ష్య మహాముని సరస్వతీదేవితో కొన్ని ప్రశ్నములను చేసియుండెను. సరస్వతి ఆ ప్రశ్నములకు చెప్పిన ఉత్తరమును వినుము అని ఆ మీరు సంవాదము నిట్లు వివరించెను.—

### మోక్ష ధర్మము

తార్క్ష్యుడు :— "దేవీ! ప్రపంచములో మనుష్యునకు మేలుచేకూర్చునది యేది? ఎట్టి ప్రవర్తనగలవాడు తన ధర్మమునుండి భ్రష్టుడు కాడు? నీ ఉపదేశములను విని నేను నా ధర్మము నుండి భ్రష్టుడను కాకుండ నుండగలను. నేను అగ్నియందు హోమము, అగ్నిపూజ ఎట్లు చేయగలుగుదును? ఏమి చేయుట వలన ధర్మము నశించదు? నీ వలన సమాధానములను విని నేను రజోగుణ దూషితుడను కాకుండ నుందునుగాక"

సరస్వతి :— "ఎవడు ఏలాటి పొరపాట్లు చేయక పరిశుద్ధుడై వేదాధ్యయనము చేయునో, అర్చిరాది మార్గములగుండా పొందదగిన సగుణ బ్రహ్మను తెలిసికొనునో అట్టివాడు దేవలోకమునుండి పైకిలేచి బ్రహ్మలోకమునకు పోవును దేవతలతో స్నేహ సంబంధమును కలిగియుండును. అచ్చట సుందరములు, విశాలములు, అతి పవిత్రములు, రమ్యపుష్పపరిశోభితములునగు సరస్సులు ఉండును. ఆ పుష్కరిణులలో బురద ఉండదు. ఆవి చేపలచేత శోభిల్లుచు ఉండును. వాటిలో దిగుటకు రమ్యములగు సోపానములు (మెట్లు) ఉండును. ఆ సరస్సులన్నియు స్వర్ణకమలములతో కప్పబడియుండును. ఆ సరస్తీరములలో పుణ్యాత్ములగు పురుషులు వేరువేరుగా అప్సరః స్త్రీలతో నుందురు. ఆ స్త్రీలు సర్వదా సుగంధవాసితురాంద్రై వివిధాభరణభూషితలై స్వర్ణ కాంతితో ప్రకాశించుచుందురు.

### గోదాన మహిమ

"గోదానము చేయువారు ఉత్తమ లోకమును పొందెదరు. బలముగల వృషభములను దానము చేయువారు సూర్యలోకమునుచేరి

సుఖింతురు. వస్త్ర దాతలు చంద్రలోకమును, హిరణ్య దాతలు స్వర్గలోకమును పొంది అమరులగుదురు. మంచి కాంతిగలిగి, పుష్కలముగా పాలను పిదుకుచు, సుందరమగు దూడనుగలిగి బంధనము త్రెంపికొని పారిపోవునదిగాకుండ నుండు ధేనువును దానముచేసినవారు, ఆ గోవు శరీరములో నెన్ని వెండ్రుకలుండునో అన్ని సంవత్సరముల కాలము దేవలోకములోనుండి సుఖింతురు. మరియు మంచి స్వభావము, బలము గలిగి నాగేటిని వహింపగలిగి, బండినిమోయు సామర్థ్యముగలిగి, యువావస్థలోనున్న వృషభమును దానము చేయువారు ధేనుదానము చేసినవారికంటెను పదిరెట్లు అధికమగు పుణ్యలోకమును పొందగలరు. కంచు పాల పాత్రతోను, వస్త్రాలంకారములతోను, ధనములతోను కపిల గోవును (పసుపు మించిన తెలుపు వన్నెగల ఆవు) దానము చేసినవారికి ఆ యావు కామధేనువై దాతకు స్వర్గసుఖమును ప్రసాదించును. దాతలు ఆగోవు శరీరములోనున్న రోమముల సంఖ్యగలన్ని పుణ్యఫలములనుపొంది, పుత్ర పౌత్ర సంపదలు గలిగియుందురు. ఏడు తరముల వరకు ఆ దాతల వంశమును కపిలగోవు ఉద్ధరించ గలదు. కాంచన శృంగములతోను కంచు పాలపాత్రతోను, ధనములతోనుగూడిన ధేనువును దక్షిణలతో బ్రాహ్మణునకు దానముచేయువారికి వసులోకములు సులభములగును. గోదాతలు, పూర్వము తాము చేసిన దుష్కర్మలఫలితముగా రాక్షస నిరుద్ధులై అంధకారమయమగు నరకములో పడువారైనను, అట్టివారిని ఆ గోదానము గొప్ప సముద్రము నుండి నౌకతరింప జేసినట్లు నరకము నుండి తరింపజేయును.

## ఇతర దానముల మహిమ

ఎవరైతే బ్రాహ్మవివాహ పూర్వకముగా (విద్యా-సదాచారము గల వరుని పిలిచి పూజించి సాలంకృతయగు కన్య నిచ్చి చేయు వివాహము బ్రాహ్మ వివాహమనబడును) కన్యకను గాని భూమినిగాని బ్రాహ్మణునకు విధి పూర్వకముగా దానము చేయుదురో అట్టి వారికి ఇంద్రలోకము ప్రాప్తించును. ఎవరు సదాచారముగల వారై నియమ పాలనము చేయుచు ఏడు సంవత్సరములు ఎడతెగకుండ అగ్నిలో ఆహుతులు చేయుదురో అట్టివారు తమతోపాటు తమకు పూర్వము ఏడుతరముల వారిని, తమ తరువాత ఏడు తరముల వారిని తరింపజేయుదురు.''

తార్క్ష్యుడు :- దేవీ ! అగ్ని హోత్రావరణమునకు ప్రాచీన నియమము లెవ్వి ? నీ యుపదేశముచేత నాకు నేడు అజ్ఞానము తొలగుగాక.

సరస్వతి :- "మునీశ్వరా ! అపవిత్రులును, చివరకు కాళ్ళు చేతులైనను కడుగు కొననివారును, వేదవిజ్ఞాన శూన్యులును వేదార్థానుభవరహితులును నగు వారు అగ్నిలోఆహుతులు చేయగూడదు. దేవతలు ఇతరుల మనోభావమును తెలిసికొను వారు కనుక పవిత్రతనే కోరుదురు. ఆ కారణముచేత శ్రద్ధలేని మనుష్యులు ఇచ్చిన హవిర్భాగమును అగ్ని స్వీకరించదు. శ్రోత్రియులు కానివారిని అనగా వేదమంత్రార్థ జ్ఞానము లేనివారిని దేవతలకు హవిస్సు నిచ్చుకార్యమునందు నియోగించకూడదు. అట్టివారు చేయు హవన కార్యము వ్యర్థమగును. తార్క్ష్యమునీ ! అశ్రోత్రియుడగు వాడు వేదములలో 'కుల-శీల' హీనుడుగా జెప్పబడినాడు. ఎట్లైతే మనుష్యుడు కుల శీలములు తెలియని అపరిచిత వ్యక్తి యిచ్చిన అన్నమును తినుటకిష్టపడడో, ఆలాగే అశ్రోత్రియుడు (వేదజ్ఞాన శూన్యుడు) ఇచ్చిన హవిస్సును దేవతలు స్వీకరించరు. కనుక అట్టివారు అగ్నిహోత్రమునకు అధికారులు కాజాలరు. ఎవరైతే బక్క చిక్కి సత్యవ్రత పాలనము చేయుచు ప్రతిదినము శ్రద్ధతో హోమముచేయుచు, హోమశేషాన్నమును భుజించెదరో అట్టివారు పవిత్ర సుగంధ యుక్తమగు గోలోకమునకు పోయి ఆపట పరమాత్మను దర్శించెదరు.

తార్క్ష్యుడు :- 'దేవీ ! నీవు ఆత్మస్వరూపురాలవు. పరలోక విషయములలోను, కర్మఫలములను గూర్చి తెలిసికొనుటలోను అత్యుత్తమ బుద్ధిగల దేవివి. నీవు ప్రజ్ఞాదేవివి గూడ నయియున్నావు. నా ప్రశ్నములకు బదులు దయయుంచి చెప్పుము.'

సరస్వతి :- 'మహామునీ! నేను విద్యాస్వరూపురాలగు సరస్వతిని. నీ సంశయములను తీర్చుటకు బ్రాహ్మణుల అగ్నిహోత్రశాల నుండి వచ్చినాను. నీవు మిక్కిలి శ్రద్ధాళువుగా కనపడుచున్నావు ఇట్టి నిన్ను కలిసికొని నేను సత్యవాక్యములన్నియు చెప్పితిని. ఎందుకనగా నేను మానవుల ఆంతరంగిక శ్రద్ధా భావనలోనే నిలిచి యుందును గాబట్టి వారివారి శ్రద్ధ ననుసరించి వారిని నేను అనుగ్రహించుచుందును.

తార్క్ష్యుడు :- "దేవీ నీతో సమానురాలు మరియొకతె లేదు. సాక్షాత్తు లక్ష్మీదేవివలె మిక్కిలి ప్రకాశించుచున్నావు. నీ రూపము దివ్యము. నీ ప్రజ్ఞ దివ్యము. నీవు ఇట్లుండుటకు కారణమేమి?"

సరస్వతి :- "నరశ్రేష్ఠా ! యాజ్ఞికులు యజ్ఞములో నెట్టి శ్రేష్ఠ కార్యముగాని లేక శ్రేష్ఠవస్తు సేకరణగాని చేయుదురో, దాని చేతనే నేను అభివృద్ధి నొంది తృప్తిపడుచుందును. అట్టి యజ్ఞముల చేతనే నేను రూపవంతురాలనగుచున్నాను. ఆ యజ్ఞములలో నుపయోగింపబడు సమిధలు, స్రుక్ స్రువములు మొదలగు వృక్షసంజాతములు, సువర్ణముమొదలగు తైజసములు, ధాన్యములు మొదలగు పార్థివములు వీటి ద్వారా నా శరీరము దివ్యరూపముతోను ప్రజ్ఞా శక్తితోను పెరుగుచుండును. అని బాగుగా తెలిసికొనుము "

తార్క్ష్యుడు :- "దేవీ ! పరమజ్ఞానులగు మునీశ్వరులు మోక్ష స్వరూపము కల్యాణదాయకమని విశ్వాస పూర్వకముగా తలచుచు ఇంద్రియ నిగ్రహముతో దాని సాధనకై ప్రయత్నించుచుందురో, ఏ మోక్షమును పరమ జ్ఞానులు మాత్రమే ప్రవేశింపగలుగుదురో, అట్టి శోకరహితమగు

పరమ మోక్ష స్థానమును గూర్చి వివరించి చెప్పుము. ఎందుకనగా అట్టి మోక్షపదమును సాంఖ్యయోగులు, కర్మయోగులు మాత్రమే తెలిసికొనెదరు. కాని నా వంటి వారికి ఆ సనాతన మోక్షస్వరూపము తెలియదు."

సరస్వతి :— "మునీశ్వరా ! వేదాధ్యయనమను యోగమునందుండి, తపస్సే ధనమని తలచుచుండు యోగులు వ్రత-పుణ్య-యోగ సాధనములచేత మాత్రమే ఆ మోక్షపదమును పొంది శోకరహితులై ముక్తులగుదురు. అట్టి స్థానమే సనాతన బ్రహ్మపదమనబడును. వేదవిదులు దానినే ఆశ్రయించెదరు. ఆ పరబ్రహ్మమునందు బ్రహ్మాండ రూపమగు నొక పెద్దవేత్రసీవృక్షము (బెత్తపు చెట్టు) కలదు. ఆ వృక్షమునందు భోగస్థాన రూపములగు అనంత శాఖలు (కొమ్మలు) ఉండును. దానిలో శబ్ద-స్పర్శాది విషయముల స్వరూపమగు సుగంధము ఉండును. ఆ బ్రహ్మాండ వృక్షమునకు మూలము (వేరు) అవిద్య-అజ్ఞానము ఆ వేళ్లనుండి నిరంతరము భోగవాసనలు అను అనంత నదులు పుట్టి ప్రవహించుచుండును ఆ నదులు పైకి చూచుటకు మాత్రము రమణీయములుగాను, సుగంధమయములు గాను తోచుచుండును. ఆ నదులు తేనె వలె మధురములు, జలము వలె తృప్తి కారకములునగు ఇంద్రియ విషయములను ప్రవహించుచుండును. కాని వాస్తవముగా చూచినచో అవియన్నియు వేగించిన వరి పేలాలవలె ఫలము నిచ్చుటకు అసమర్థములు. అనేకఛిద్రములు గలిగి హింసాకరములుగా నవిచియుండును అనగా మాంసమువలె అపవిత్రములు, ఎండిపోయిన ఆకుకూరవలె సారహీనములుగాను, పాయసమువలె రుచికరముగా నున్నప్పటికి బురదవలె చిత్తమును మురికి చేయునవిగా నుండును. ఆ నదులు బ్రహ్మాండ వృక్షమునందు ప్రతిశాఖలో వేరువేరుగా ఇసుకవలె ప్రవహించుచుండును. మహాముని ! ఇంద్ర—అగ్ని-వాయు—సూర్యాది దేవతాగణము ఏ పరబ్రహ్మమును పొందుటకు ఉత్తమ యజ్ఞముల ద్వారా పూజించుచుందురో అవియే నా పరమపదము—ఉత్కృష్టస్థానము.

అని సరస్వతీదేవి తార్క్ష్యమునికి చెప్పినపర బ్రహ్మ స్థాన స్వరూపమును గూర్చి వైశంపాయన మహాముని జనమేజయునితో చెప్పినవి మార్కండేయ మహాముని చెప్పగా విని ధర్మరాజు మిక్కిలి ప్రసన్నుడై 'మహాత్మా! ఇప్పుడు మాకు వైవస్వతమనువు యొక్క చరిత్ర చెప్పుమని యడుగగా నతడిట్లు చెప్పదొడగెను:—

## వైవస్వత మనుచరిత్ర—మత్స్యావతార కథ

"ధర్మరాజా ! వివస్వంతునకు (సూర్యునకు) ప్రతాపశాలియగు పుత్రుడుండెను. అతడు ప్రజాపతితో సమానమగు తేజస్సుగల మహర్షియై యుండెను. అతడు బదరికా వనమునందు ఊర్ధ్వబాహువై ఒంటి కాలిమీద నిలిచి ఘోరతపస్సు చేసెను. అతడే వైవస్వతమనువు. అనగా, వివస్వంతుని-సూర్యుని యొక్క పుత్రుడగు మనువు అని యర్థము. అతడు తేజో-బల-కాంతి-తపస్సులందు తండ్రియగు సూర్యుని, పితామహుడగు కాశ్యపుని మించినవాడై యుండెను అట్లు బదరికా వనములో నతడు కొంతకాలము తలవంచి అనిమిషుడై (కన్నులు తెరచి) పదివేల సంవత్సరములు తపస్సుచేసెను తడిసిన వస్త్రములతోను జటలతోను చీరిణీ నదీతీరమునందు తపస్సు చేయుచున్న యతనికడ కొకప్పుడు ఒక మత్స్యము వచ్చి యతనితో నిట్లనెను:—

" భగవన్ ! నేను క్షుద్రజంతువైన చేపను కనుక బలవంతుల వలన నాకు సర్వదా భయము గలదు. నా జాతిపెద్ద మత్స్యములు గూడ నన్ను బాధించుచుండును బలముగల పెద్దచేపలు దుర్బలములగు చిన్న చేపలను భక్షించుచుండును ఇది పురాతన కాలము నుండి మా మత్స్యజాతిలో, విధినిర్మితమైనవృత్తి ఈ భయమునుండి నన్ను రక్షింపుము దీనికి నేను నీకు ప్రత్యుపకారము చేసెదను."

ఆ చేప మాటలువిని వైవస్వతమనువు కృపగలవాడై దానిని నీటినుండి చేతిలోనికి తీసుకొని ఒక చిన్న కడవలో నుంచెను. అది చంద్ర కిరణములవలె తెల్లనిదై సుందరముగా నుండెను ఆ మత్స్యమును పుత్రప్రేమతో నతడు పెంచుచుండెను. అది కొంతకాలమునకు పెరిగి యాకడవలో నిముడ లేదు అప్పుడు దాని కోరికపై మనువు దానినొక పెద్దబావిలో నుంచెను. రెండు యోజనముల పొడవు ఒక యోజనము వెడల్పు గల ఆ బావిలో మత్స్యము పెరుగుచు కొన్ని యేండ్లకు ఆ బావి వైశాల్యమున్న మించి పెద్దదయ్యెను. అదిగూడ చాలనందువలన నాచేప, తనను గంగానదిలో విడువుమని మనువును కోరెను అతడు దానిని గంగానదిలో విడిచెను. అప్పుడది 'మహానుభావా! నేను నీచల్లని చేతులలో పెరుగుచు పెద్దగానగుచున్నాను కనుక నేను పెరుగుచున్నకొల్ల నా కోరికను నెరవేర్చుచు స్థానాంతరమునకు చేర్చుచుండుము' అని వేడుకొనెను. కొంతకాలము గంగలో నివసించిన తరువాత మనువుతో 'మహాత్మా : నేనీ గంగానదిలో స్వేచ్ఛగా తిరుగజాలనంత పెద్ద శరీరముగల దాననైతివి కనుక నన్ను సముద్రములో విడువుము' అని ప్రార్థించగా మనువు ఆలాగే చేసెను. మహాకాయమగు మత్స్యమును ఎత్తుకొని మనువు సముద్రమునకు తీసికొని పోవుచున్నప్పటికిని అది యేమాత్రము బరువు లేనిదిగా, సుఖస్పర్శ గలదై సుగంధయుక్తముగా నతనికి మోయుటకు అనుకూలముగానయ్యెను. అట్లతడు దానిని మోసికొని పోయి సముద్రములో విడిచెను. అప్పుడది మనువుతో నిట్లనెను:—

" మహాత్మా ! నీ రక్షణలో నేను సుఖముగా నుంటిని. ఇప్పుడు నీకొక అవసరము సంప్రాప్తమయినది, చెప్పెదను వినుము. త్వరలోనే యీ స్థావర జంగమాత్మకమగు సర్వ ప్రపంచమునకు ప్రళయకాలము రానున్నది. ఒకే మహాసముద్రమై ప్రపంచమంతయు నీటిలో మునిగిపోవును. కనుక నీకొక హితమును బోధించెదను వినుము. ప్రపంచమునకంతటికి మహా భయంకర సమయము ఆసన్నమైనది. నీవొక దృఢమగు ఓడ చేయించుకొనుము. దానికొక గట్టి త్రాడును కట్టుము. దానిలో నీవు సప్తర్షులతో పాటు ఎక్కి కూర్చొనుము. బ్రాహ్మణులు

పూర్వము చెప్పిన అన్ని విధములగు బీజములనుగూడ సంగ్రహించి ఆ నావలో నుంచుకొనుము దానిలో నెక్కిన తరువాత నాకై వేచి యుండుము అక్కడికి నేను వచ్చెదను. నాకొక పెద్దశృంగము ఉండును ఆ కొమ్మును జూచి నన్నుగా గుర్తింపుము నేను నీకు అప్పుడు సహాయము చేయకున్నచో నీవు ఆ జల ప్రళయము నుండి తీరమును చేరజాలవు ఇదియే నేను నీకు చేయు ప్రత్యుపకారము నాకు సెలవిమ్ము పోయి వచ్చెదను నన్ను గాని, నామాటలను ఏ మాత్రము సందేహించకుము "

మత్స్యము చెప్పినమాటలువిని మనువు 'అట్లే చేసెదను' అని చెప్పెను. ఆ యిరువురు విడిపోయి యథేచ్ఛగా సంచరించు చుండిరి.

ఆ తరువాత మనువు మత్స్యము చెప్పిన మేరకు ఒక సుందర నౌకను సిద్ధముచేయించి దానిలో సమస్త బీజములను ఉంచుకొని సప్త ఋషులతో పాటు సముద్రములో తిరుగుచుండెను. ప్రళయకాలమాసన్నము కాగానే మనువు మత్స్యమును తలచెను. వెంటనే అది శృంగముగలదై వచ్చెను. అది పర్వతమువలె మహోన్నతముగా నుండెను అది రాగానే మనువు తన నావకు కట్టిన పెద్దత్రాటిని ఆ చేపకొమ్ముకు గుఱ్ఱముమూతికి కళ్ళెమును వలె తగిలించెను అట్లు నావను శృంగముతో కట్టుకొని ఆ మహామత్స్య భగవానుడు లవణ సముద్రమునందు నావకు భయము లేకుండా ఈడ్చుకొని అతివేగముగా పోవుచుండెను. సముద్రము, అలలచే నర్తించుచున్నట్లును, జలధ్వని చేత గర్జించుచున్నట్లును ఉండెను. దానిలో మహావాయువులచేత శోభిల్లుచు నూగుచున్న ఆ నౌక మదముచే తడబడుచు నడచుచున్న చంచల స్త్రీవలె గోచరించెను. అప్పుడు భూమిగాని ఆకాశముగాని దిక్కులుగాని తెలియక ప్రపంచ మంతయు నేక జలాకారముగా నుండెను. అప్పుడు, మనువు, మత్స్యము, సప్తర్షులు మాత్రమే కనబడు చుండిరి సర్వ ప్రపంచము జలములో మునిగియుండెను. మత్స్య భగవానుడు అనేక సంవత్సరములిట్లే ఆ మహాసముద్ర జలమునుండి అవలీలగా నావను లాగుచు హిమవత్పర్వత శృంగమునకు తీసికొని పోయెను 'మీరు ఈ నావను అతిశీఘ్రముగా ఈ పర్వత శిఖరమునకు కట్టుడు' అని ఋషులతో మత్స్యము చెప్పగానే వారట్లు చేసిరి. ఆ హిమవత్పర్వత శిఖరము నేటికిని నౌబంధనము అను పేరుతో ప్రఖ్యాతమై యున్నది. అప్పుడు అనిమిషములోని చనుడగు నా మత్స్య భగవానుడు ఆమహర్షులతో నిట్లనెను:—

"మహామునులారా ! నేను ప్రజా పతియగు బ్రహ్మను. ననువినా మరియొక వస్తువేదియు ఈ మహా ప్రళయమునందు ఉండదు. నేను మహామత్స్య రూపములోనుండి మిమ్మందరను ఈ మహా ప్రళయకాల సముద్ర భయమునుండి ఉద్ధరించితిని ఈ మనువు ఇకపైన స్థావరజంగమాత్మకమగు సర్వప్రపంచమును, సర్వలోకములను సృజించవలెను. నా యనుగ్రహముచేత నితడు మహా తపో మహిమచేత శోభితుడై ప్రపంచ ప్రజా సృష్టిని చేయుటలో నెంత మాత్రము మోహము చెందడు "

"అని చెప్పి ఆ మత్స్య భగవానుడు క్షణములో నంతర్ధానము చెందెను. వైవస్వత మనువు ప్రపంచ సృష్టిని చేయ దలచెను. కాని ప్రజా సృష్టిచేయుటలో నతనికి మోహమేర్పడి ఏమియు తోచకపోయెను. అప్పుడతడు మహా తపస్సుచేసి, ఆ తపోబలముచేత ప్రపంచ సృష్టి చేయుటకు ఉపక్రమించెను

"ధర్మరాజా నీకు సంగ్రహముగా మత్స్యావతార పురాణమును చెప్పితిని ఈ పురాణమును, వైవస్వతమను చరిత్రను వినువారు, చదువువారు సర్వ పాపములనుండి విముక్తులై, సర్వ సుఖములనుబడసి, సర్వ లోకములలో సంచరించగలరు." అని చెప్పి మార్కండేయ మహాముని చెప్పిన కథను విని ధర్మరాజు చతుర్యుగముల ప్రభావమును, విశేషమును తెలుపుమని ఇట్లు ప్రార్థించెను.

## యుగ మహిమ వర్ణనము

"మహాత్మా అనేక యుగ సహస్రములను నీవు చూచినావు. నీతో సమానుడగు వారియొకడిచట లేడు ఒక్క బ్రహ్మదేవుడు దప్ప నీకు మించిన ఆయుష్షు మరియొకనికి లేదు. అంతరిక్షము, దేవదానవులు లేని యీ లోకమునందు ప్రళయకాలములో నీ వొక్కడవే మిగిలియుండి బ్రహ్మను ఉపాసించుచుందువు ప్రళయము ముగిసి బ్రహ్మదేవుడు మేల్కొనిన తరువాత నీవొక్కడవే యీ భూత సృష్టినంతయు చూడగలుగుదువు లోకగురువగు బ్రహ్మను నీవు అప్పుడు ఆరాధించెదవు విష్ణు భక్తులలో నీవు శ్రేష్ఠుడవు నీ మహిమ సర్వ లోకములలో కీర్తింపబడుచున్నది. నీవు హృదయ కమలమును తెరచి వైరాగ్యముపొందిన దివ్య దృష్టితో భగవంతుని అనేక పర్యాయములు సాక్షాత్కరించినావు బ్రహ్మానుగ్రహముచేత నీకు జరా మృత్యువులు లేవు. గత చరిత్రయంతయు చూచినవాడవు గనుక అన్నిటికి కారణమగు కాలమును గూర్చి నిరూపించు విధము జెప్పుము. సర్వలోకములందు నీకు తెలియనిది నీవు అనుభవించనిది మరియొకటి లేదు. కనుక నీ ముఖమునుండియే ఆ కథలను వినగోరుచున్నాము." ఇట్లు ధర్మరాజు చేసిన ప్రార్థనను మన్నించి మార్కండేయ మహాముని యిట్లనెను.

"రాజా ! నేను పరమ పురుషుడు పరమాత్ముడునగు భగవంతునకు నమస్కరించెదను. అతడు సర్వ ప్రపంచ కర్త, అచింత్యుడు, అతి పవిత్రుడు, ఆది మధ్యాంత రహితుడు. కర్తగా నుండికూడ ఏమియు చేయడు. పురుషార్థములను ఇచ్చుటకు అతడే కారణము. సమస్తమును తెలిసినవాడు. కాని అతనిని వేదములు గూడ తెలిసుకొనజాలవు. ప్రళయాంతమునందు తిరిగి సర్వ ప్రపంచమునకు సృష్టికర్త యతడే.

"రాజా ! కృత యుగ ప్రమాణము నలువది యెనిమిది వందల దివ్య సంవత్సరములు. త్రేతా యుగమునకు ముప్పది యారు వందల దివ్య వర్షములు. ద్వాపరమునకు యిరువది నాలుగు వందల దివ్య వర్షములు. కలియుగము పన్నెండు వందల దివ్య సంవత్సరములు. కలియుగాంతమునందు పునః కృతాది యుగములు వచ్చును. ఈ విధముగా పన్నెండు వేల దివ్య సంవత్సరములకు ఒక చతుర్యుగి అగును. ఈ చతుర్యుగములు వేయి గడచినచో బ్రహ్మకు ఒక దినమగును. ఈ సమస్త జగత్తు బ్రహ్మదేవునియొక్క ఒక దినము మాత్రము ఉండును. ఆ దినము ముగియగానే ప్రపంచముగూడ సమాప్తమగును. దీనినే ప్రళయకాలమందురు "

(సశేషం)

# జానపద సాహిత్యము పల్లె పదాలు

**కందాళ కుప్పస్వామి**

మన భారతదేశము అనాది నుండి అన్ని కళలకు ఆలవాలమైనది. ఒకవైపు సంగీతము, మరొక వైపు సాహిత్యము ప్రాధాన్యము గాంచినవి. సాహిత్యమనెడి వృక్షము శాఖోపశాఖలై విశ్వకల్యాణమునకు దోహదములైన గొప్ప గొప్ప కావ్యములు వెలసి పండితులను రంజింపజేసినది. అంతేగాక పల్లీయుల జీవితాలను ప్రతిబింబింపజేసి, వారి జీవన విధానములను కన్నులకు కట్టినట్లు చూపు జానపద సాహిత్యముగూడ ఉద్భవించినది. జానపద సాహిత్యము పామరులనేగాక పండితులనుగూడ రంజింపజేసినది.

పల్లె ప్రాంతములు భారత దేశమునకు పునాది రాళ్ళు వంటివి. మనదేశము వ్యవసాయముపై ఆధారపడినందున పల్లె ప్రజలకు ప్రాముఖ్యత ఇవ్వబడినది. పగలంతా పొలాల్లో కష్టపడి పనిచేసి సాయంత్రం ఇల్లు చేరుకోగానే రైతులు కష్టాలన్నీ మరచి పాడుకొనే పాటలు కొన్ని. భర్తకు అన్ని సమయాల్లో అండదండగ నుండి పొలం పనులలో పాలుపంచుకొని, నాట్లు సమయాల్లోను కలుపుతీయునపుడు తూర్పారబోయునపుడు స్త్రీలు పాడుకొనే పాటలు కొన్ని, తొలికోడి కూయకమునుపే కపిలె తోలుతూపాడే పాటలు కొన్ని, స్త్రీలు ఇంటిలో దంచునపుడు, విసరునపుడు, పండుగ పబ్బాల సమయాలలో హాయిగా ఆనందముగా పాడుపాటలు మనకు ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. పల్లీయులు వారుచేయు పనిని సుళువుగా నిర్వహించుటకును, మనస్సునకు ఆహ్లాదము కలిగించుటకును, వారు పడు కష్టాన్ని మరచిపోవుటయే ఈ పల్లెపాటల ఉద్దేశము. వీటిలో సాహిత్యపుదృష్ట్యా చక్కని శైలి, సరియగు ఉదాహరణలు, అలతి అలతి పదాలతో అనంతభావాలు సృష్టించి ఎంతో ఆనందం కలిగిస్తాయి.

పల్లెలలో వారికి సహాయపడునవి పశువులు. వాటిని ఎంతో ప్రేమతో పెంచుతారు. ఇవే వారి ప్రాణాలుకూడ.

పల్లెలలో "నాగుల చవితి" గొప్ప పండుగదినము. ఆ దినమున స్త్రీలు నిష్ఠతో నుండి నాగేంద్రుని ప్రార్థించి పాలు పోస్తారు భారతీయ స్త్రీజాతిని ప్రతిబింబింపజేసే ఈ పల్లెపదాన్ని చూడండి.

సీపుట్ట దరికి నా పాపలొచ్చేరు
పాప పుణ్యముల వాసనే లేని
బ్రహ్మస్వరూపులౌ పసికూనలోయి
కోపించి బుస్సలు కొట్ట బోకోయి
నాగుల చవితికి నాగేంద్ర నీకు
పొట్ట నిండా పాలు పోసేను తండ్రి.

అర్ధరాతిరి యేల అపరాత్రి యేల
పాపమే ఎరుగని పసులు తిరిగేని
ధరణికి జీవనాధారాలు సుమ్మ
వాటిని రోషాన కాటేయ బోకు ॥నాగు॥

పగలనక రేయనక పనిపాట లందు
మునిగి తేలేటి నా మోహాల బరిణె
కంచెలు కంపలు గడిచేటి యేల
కంపచాటున నుండి కొంప దీకోయి ॥నాగు॥

భారతీయ స్త్రీ సర్వస్వము స్పష్టంగా దీనిలో గోచరిస్తుంది. మొదటిది తనపిల్లలు. వారేమో బ్రహ్మ స్వరూపులట. వారిని జాగ్రత్తగ కాపాడమని వేడికోలు.

రెండవది ధరణికి జీవనాధారాలైన పశువులు. అవి వేళకాని వేళలో తిరుగుతూ వుంటవి. అందుచే రోషాన వాటిని కాటేయ వద్దని ప్రార్థన.

మూడవది ప్రాణానికి ప్రాణమైన మోహాల బరిణె (భర్త) ఎంత చక్కని ఉపమానము. పగలు రాత్రి యనక పొలాల్లో పనిచేస్తాడు కాన అతనికి ఏలాటి అపకారము కలుగజేయ వద్దని నాగేంద్రుని ప్రార్థిస్తుంది.

ఈ భావాలు అతి సామాన్యమైనవి, అందరు ఎఱిగినవి కూడ. కాని వాటి తీరు, పదవిన్యాసము జానపద సాహిత్యంలో కొట్టవచ్చినట్టు కనబడుతుంది. భారత స్త్రీ నిర్మలమైన ప్రేమను, అనురాగాన్ని చాటుతుంది. "కొంపదీకోయి" అన్న పదం వెనుక నిగూఢార్థ మిమిడి యున్నది. అదియే కవి చమత్కృతి.

గ్రామాల్లో రైతులు పొలాలకు నీరు పారించుటకు, తొలి కోడి కూయగనే లేచి కపిలె తోడుటకు వెళ్ళుట పరిపాటి. రైతు తాను చేయు పనిలో కష్టాన్ని మరచుటకు గాను కపిలె పాటలు పాడుతూ నీటిని తోడును. రైతు తన గొప్పతనమేగాక, తన పశువుల గొప్పతనాన్ని చాటే ఈ పదం చూడండి. ఇందులోని సునిశిత శృంగారం మనకు తెలియకనే తెలుపుతుంది.

కుడితట్టూ రాముగాడు—ఎడమతట్టు భీముగాడు
అవి రెండు తోలేటోడు— కుచ్చుల కుళ్ళాయివాడు,
ముందు పోయే రాముగాడూ—కాలుగిరిరంకె గొట్టె"
కపిలె దోలే సిన్నవాడు మోకు దొక్కి—కేకవేసె"
కర్రి ఎద్దు కాడి కాడా—కపిలె బిల్లల మోదు జూడీ
తోలు మోకుల బిగువు చూడీ—తోలెటోని లగువు జూడీ॥

అవతలెదూ అందగాడు-ఇవలెదూ మందగాడూ
తోలె టోడూ సక్కనోడూ—కొప్పుజూసి తప్పుతోలె॥



పండుగ పబ్బాల సందర్భంలో పల్లె ప్రజలు చాలా సంతోషంగా కాలం గడుపుతారు సాధారణముగా గ్రామం గ్రామం తిరుగుతూ బిచ్చమెత్తుకొనువారు సయితం పల్లెలనే అంటి పెట్టుకొని వుంటారు. వీరిలో గంగిరెద్దులను ఆడించు వారొక తెగవారు. వారు గంగిరెద్దులను ఆడిస్తూ పాటలు పాడుతూ వుంటారు. ఈ క్రింది పదంలోని నగ్నసత్యాలను గంగిరెద్దు పేరుతో మన కెలా విని పిస్తున్నాడో చూడండి.

ప్రభువుగారికి దండం పెట్టు, పాదం వంచి భక్తి నిబెట్టు
పట్టుశాలువలు కప్పేదరంట, కాసులు మువ్వలు కట్టెదరంట
డూ డూ డూ డూ బసవన్న. డూ డూ డూ డూ ఎంకన్నా
మోసము చేయును మునసబుగారు' కిషలు కట్టును కరణంగారు
కలిమి కలిగినా కాపులు వీరు ॥డూ, డూ డూ డూ
కుంచెడు మాయ కోమటి మాట పత్తి కాయరా బేమ్మణధాటీ
సలాము తెచ్చే సాయబు భేటీ॥డూ డూ డూ డూ
చెన్నపట్నం చేరువలేదు కాశీపట్నం కానగరాదు
కాపవరం మేం కదలా లేదు డూ డూ డూ డూ
చెట్టు కదిలినా పుట్ట వొదలదు నీరుపోయినా నాచుకదలదు
గుడి పాడైన గూబ వదలదూ, గుడి పొలాలు పూజారి వదలడు
॥డూ డూ డూ డూ॥

ఏడు కొండలా ఎంకన్నండీ
ఎండి కొండలా ఈశ్వరుడండీ
భమిడి కొమ్ముల బసవయ్యండి ॥డూ డూ డూ డూ॥

పల్లె ప్రజలు చాలా అమాయకులు. నిష్కల్మష హృదయులు. ఒకానొక పల్లెవాడు పట్టణం వెళ్ళి అక్కడ తను చూచిన వింత విషయాలను తన వారికి ఎలా చెప్తున్నాడో చూడండి.

ప్యాటోల్ల సూసొత్తినే—ఓయమ్మ ప్యాటోల్ల సూసొత్తినే
నీసైన ఏసాల నిండా తమాసాల॥ ప్యాటోల్ల॥
తెల్లంగ సల్వ బట్టలే— ఓయమ్మ— ఒల్లెల్ల నిండ గట్టల్లే
తెల్లంగ సల్వబట్ట ఒల్లెల్ల నిండగట్టీ
సల్లాని పొద్దుకాడ సవారెల్లే వాల్ల॥ ప్యాటోల్ల॥
కాల్ల నిండ మూత సెప్పులే ఓయక్కా—కళ్ళా కద్దాల కప్పులే

కాల్ల నిండ మూత సెప్పు కళ్ళా కద్దాల కప్పు
సాలు గట్టి సందకాడ సవారెల్లే వాల్ల॥ ప్యాటోల్ల॥
ముందరెనక రెండు గాండ్లె—ఓయత్త— అందమైన మరల బండ్లు

సందకాడ కూకోని సవారెల్లే వాల్ల॥ ప్యాటోల్ల॥
కీసు బీసు మంట బాసలే—ఓయమ్మ—సూసేకి నెత్తియాసలే
కీసు బీసు మంట బాస సూసేకి నెత్తియాస
సాసి సేయి సేయి కలిపి సవారెల్లే వాల్ల ॥ ప్యాటోల్ల॥

పట్టణ వాస ప్రజల వేషధారణ చాల వింత గొలుపుతుంది. పల్లె వాతావరణంలో పుట్టి పెరిగిన జానపదునకు పట్టణంలోని వారు చాలా తమాషాగా కనబడుతారు. పట్టణంలో తను చూచిన మనుషులను పల్లెవారికి ఎలా చెబుతున్నాడో చూడండి.

ఏంటి ఏసాలమ్మ యియ్యి? కంటితో సూసేకిగాని
యవతారాలు॥ ఏంటి॥

జుట్లల్ల తెగగొరిగి పొట్టి బొచ్చును బెంచి
సొట్ట పాపట దీసి సొగసులని మురుసుతా॥ రేంటి॥
మూతి మీసాలొరిగి ముక్కుకాడికి బొచ్చు
పులిపి రున్నట్లింత నిలిపి సొగ సంటారు॥ ఏంటి॥

చొక్కాకు మెడ కాడ పక్క సన్నులు బెట్టి
సిక్కని పలుపొక్క చెక్కించు కుంటారు ॥ఏంటి॥

పైకిబిసె ఎదకాడ పాలు దెరుసుకోని
పక్కలోపల సలవపాత యిరికిత్తారు ॥ ఏంటి॥
ఎడమ సేయి కడాన ఏందొ తలతల బిల్ల
తోలు పట్టెడబెట్టి యాలాట గడతారు ఏంటి॥

ఒల్లె ఎనకాలి కెగజెక్కి ఓరగా
కాల్లకాడికి యినప కడెము తగిలేత్తారు॥ ఏంటి॥

పట్టణ వాతావరణం చూచిన పల్లె వాడు పట్న వాసపు పిల్లను పెండ్లి చేసుకోదలచి తన కోరిక కాస్త బయట పెట్టాడు కాబోలు. తనవారికి పట్న వాసపు పిల్లలు నచ్చలేదు, పల్లె వాతావరణానికి వారు సరిపోరు. అందు చేత తన వారంత పట్టణ వాసపు పిల్లలు వద్దని ఎలా చెబుతున్నరో చూడండి.

మెరసే పేట పిల్లలు మనకేలా ఓనాయన్నొ ॥మెఱ॥
పక్క పాపటాలు బెట్టి-పైట కొంగులు పూవులుగుట్టి
పాడు పౌడరు మొగాన గొట్టి పనికి మాలిన దుస్తులు
గట్టి॥ మెఱ॥

బోలెము బోలె బుసిడి చుట్టి- బొమలనడుమ బొట్టును బెట్టి
టోడి చేత గడియారము గట్టి బోగమోళ్లవలె యీదులు
బట్టి ॥మెఱ॥

ఇంటి పనులకు బండ గొట్టి—వంట వార్పులకు సున్న చుట్టి
కంటి కద్దాల జోడు బెట్టి—కనబడిన వానిచేయిబట్టి ॥ మె॥
మగని విడిచి మీటింగులకేగి—మనసు నచ్చినట్లలను వాగి
మట్టు మీరి కాఫీ, టీ త్రాగి మగవారలను మించి విర్రవీగి
॥మెఱ॥

ఇలాంటి పల్లె పదాలు మనకు మారు మూల ప్రదేశాలో లభిస్తాయి. వీటిని అభిమానించు వారు చాలా తక్కువ. అందు చేత మరుగు పడిన వీటిని సేకరించి పునరుద్ధరించుట సాహితీ ప్రియుల కర్తవ్యము.

సాహిత్య గ్రంథాలు గొప్పవారి చరిత్రలు, జీవితాలను తెలిపితే, జానపదసాహిత్యం పల్లె ప్రజల జీవితాలను ప్రతిబింబింపజేస్తాయి. ఈ అనంత కవిత్వాన్ని రెండు భాగములుగ చేసిన మొదటిది కవియొక్క ప్రతిభ ప్రయత్నములచే సాగించిన రచన రెండవది పామరుడైన జానపదుని ఆనందంకోసం సృష్టించిన రచన. ఈ జానపదగేయాలు పదాలు రెండవ భాగమునకు చెందును.

ఈ గేయాలు, పదాలు దేని కదియేసాటి. ఇందులో మన జాతీయ జీవనము తొణికిసలాడు చుండును. ఈ సాహిత్యము మన దేశమునందు అనాదిగ నున్నట్లు కనబడును, కాని దీని నాదరించిన వారు తక్కువగుటచే కొంతవరకు మరుగుపడినది. ఈ మరుగు పడిన జానపద సాహిత్యమును వెలికి తీసి పునరుద్ధరించుటకొఱకు సాహిత్య సంస్థలు ప్రయత్నాలు చేస్తున్నాయి. వీటిని సేకరించి, మన జానపద సాహిత్యమునకు జీవము పోసినచో సాహిత్య ప్రపంచమున కెంతయో సేవచేసిన వార మగుదుము. ★

## ఈ సంచికలో రచయితలు

శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి, రాజాం, శ్రీకాకుళం జిల్లా
శ్రీ యర్రమిల్లి చలపతిరావు, శ్రీ వత్సవ, చోడవాడ, విశాఖపట్టణం జిల్లా
శ్రీ దేవుపల్లి సత్యారావు, యలమంచిలి, విశాఖపట్టణం జిల్లా
శ్రీ ముద్దసాని రాంరెడ్డి, ఊటూరు, వయా వినయవంక, కరీంనగర్ జిల్లా
శ్రీ పుల్లాభట్ల వెంకటేశ్వర్లు, సాయం కళాశాల, నల్లగొండ
శ్రీమతి అచ్యుతుని లక్ష్మీకనకవల్లి, తెనాలి, గుంటూరు జిల్లా
శ్రీ కాసు వెంగళరెడ్డి, జిల్లా పరిషత్ అధ్యక్షులు, గుంటూరు
శ్రీ చావలి రామమూర్తి, స్మాల్ సేవింగ్స్ ఆర్గనైజర్, నిజామాబాదు
శ్రీ మిరియాల రామకృష్ణ, తెలుగు అకాడమీ, హైదరాబాదు
శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య, శీతాఫల్‌మండి, సికింద్రాబాదు
శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, సమాచారశాఖ, హైదరాబాదు
శ్రీ కందాళ కుప్పస్వామి, పాఠ్య గ్రంథ ముద్రణాలయం, హైదరాబాదు
శ్రీయుతులు విహారి, శాలివాహన, మచిలీపట్టణం
శ్రీ కె. శివారెడ్డి, వివేకవర్ధనీ కళాశాల, హైదరాబాదు
శ్రీ మంజీర, న్యూ మలక్‌పేట, హైదరాబాదు
శ్రీ అక్కిరాజు రమాపతిరావు, తెలుగు అకాడమీ, హైదరాబాదు

# ఎక్కువ పంటలను పండించుకోండి బ్యాంక్ ఆఫ్ బరోడా వ్యవసాయ పనులకు అప్పులు యిస్తుంది

మంచి విత్తనములు, మంచి ఎరువులు, మంచి పనిముట్లు భూమిని పదును చేస్తాయి. మంచి పంటలను పండించుకొనుటలో మీకు కావలసిన వాటిని కొనుక్కొని....డబ్బు గడించుటకు బ్యాంక్ ఆఫ్ బరోడా అప్పులను యివ్వగలదు.

సిరిసంపదలకు అక్షయపాత్ర




## బ్యాంక్ ఆఫ్ బరోడా

హెడ్ ఆఫీస్: మాండ్వి, బరోడా.

550 పైగా బ్రాంచీలతో భారతదేశములో దాదాపు ప్రతి స్టేటులోను సేవ చేస్తోంది ఇంకా: యు.కె., తూర్పు ఆఫ్రికా, మారిషస్, ఫిజీ ద్వీపములు మరియు గియానాలలో బ్రాంచీలు కలవు.

Shilpi BOB 10/71 Tel

# 'మనిషి మనిషికి చెప్పేండి కథ'

విహారి మరియు శాలివాహన

పరంధామయ్యని గురించి అంతా చెప్తాను.

బంగ్లాదేశ్ సమస్యను గురించి మా సమితి ఒక సమావేశాన్నేర్పాటు చేసింది. దానికి అధ్యక్షత వహించవలసిందిగా మిత్రులంతా నన్ను కోరేరు.

ఆ రోజు సాయంత్రం—

సభ ప్రారంభమైంది. నాకు తోచిన విషయాలు నేనూ మాట్లాడాను. సభ అయిపోవస్తుండగా శ్రోతలలో నుంచీ ఒక చిన్న చీటీ నాకు చేరింది.

చదివేను. "అధ్యక్షుల వారికి—కొద్ది నిమిషాలు సెలవిస్తే నాకూ మాట్లాడాలనివుంది. అవకాశమిప్పిస్తారని ఆశిస్తూ—జి. పరంధామయ్య". అనివుంది. చీటీ వచ్చినవైపుగా తల త్రిప్పి చూశాను.

ఆయన జేబులోనుంచీ కాగితాల బొత్తి తీసి వాటిలో కొన్నింటిని ఇవతలకి తీసుకుంటున్నాడు. వయస్సు 60 ఏండ్ల దరిదాపుల్లో వుంటుంది. బట్టతలమీద అక్కడక్కడా మిగిలిన రెండుమూడు వెంట్రుకలు—గోదావరి తిన్నెల్లో నిలిచిన దర్భ పోచల్లావున్నాయి. కట్టుకున్న సిల్కాపి పంచె అంచులు ఎణ్ణమట్టితో మకిలి పట్టి పీచులు రేగిపోయివుంది. కోరా లాల్చీ చిరుగులు ఎండిపోయిన చర్మపు ముడుతల్ని చూపుతున్నాయి. పైనున్న తుండు చాలా చిన్నదిగా వుంది. వీటన్నిటికంటే కొట్ట వచ్చినట్టు కనిపిస్తున్నది—కనుబొమల మధ్య తీర్చిదిద్దిన కాసంత కుంకుమ బొట్టు.

వయసులో నాకన్నా చాలా పెద్దవాడు పరంధామయ్య. ఆయన మాటను తిరస్కరించ లేకపోయాను. మాట్లాడటానికి అనుమతిస్తూ ఆయన్ని వేదిక మీదకు రమ్మన్నాను.

చకచకా నడిచివచ్చి మైకు ముందర నిలబడి గొంతు సవరించుకున్నాడు పరంధామయ్య.

"అధ్యక్షుల వారికి, సోదరులకు—ఏదో పనిమీద ఈ వూరు వచ్చిన నేను ఇక్కడకు రావటం మీ అందరి అభిప్రాయాలు వినడం తటస్థించింది. ముఖ్యంగా నాకు ఈ అవకాశాన్నిచ్చిన అధ్యక్షుల వారికి ధన్య వాదాలు" అంటూ చేతిలోవున్న కాగితాన్ని తీసి పద్యాలు చదవటం మొదలెట్టేడు.

'కవిత వినిపించ రాలేదు కవినికాను...'

'వ్రాసితి పూర్వమే కవిత గ్రంథములేవియు అచ్చులోన లేవు...'

'గురువులకు మ్రొక్కి సభికుల గౌరవించి...'

ఈ ధోరణిలోనే వున్నాయి పద్యాలన్నీను. నేను గడియారం చూసుకున్నాను ఆయన మొదలుపెట్టి పదినిమిషాలైంది.

'మీరు చెప్పే విషయమేమిటండీ" ఎవరో ప్రశ్నించారు.

పరంధామయ్య తాపీగా సమాధానమిచ్చేడు. "వస్తున్నా. అదే విషయాని కొస్తున్నా" అంటూ కాగితాల్ని జేబులో పెట్టుకున్నాడు. అప్పుడిక అసలు విషయంలోకి దిగాడు.

"బంగ్లాదేశ్ దుస్థితిని గురించి మనకు అనేక వార్తలు తెలిశాయి. మన దేశానికి కొన్ని లక్షల మంది శరణార్థులుగా వచ్చారు. వారందరి బాగోగులు చూస్తున్న మనదేశపు బడ్జెట్ అంతా తారుమారయింది ఈ సమస్య తీరాలంటే మనదేశానికి వస్తున్న జనాభా. మనదేశంలోని జనాభా పెరగకుండా చూడాలి. అదే మనముఖ్యకర్తవ్యం, జనాభా పెరుగుదలను అరికట్టాలి. అలా చేయనినాడు మనదేశం ఏమౌతుంది? ఏమౌతుంది? అని అడుగుతున్నాను." బల్లగుద్ది మాట్లాడుతున్న పరంధామయ్య దేశాన్ని గురించి విపరీతంగా బాధపడ్తూ వేదికదిగాడు. ఆ నాటి సభ ముగిసింది—

రోజులు గడిచి పోతున్నాయి—

రెండు నెలల తర్వాత—

ఒక రోజు రాత్రి సెకండ్‌షో సినిమాకని బయల్దేరాను. సినిమాహాలు దరిదాపుల్లోకి వస్తున్న నాకు. "మాష్టారూ...ఆగండి" అని చప్పట్లు చరుస్తూ పిలిచినట్లు వినబడి వెనక్కు తిరిగి చూశాను. పరంధామయ్య! చకచకా నాకేసి వస్తున్నాడు.

"ఎప్పుడొచ్చారీవూరు?" కుశల ప్రశ్నలనంతరం ప్రశ్నించాను.

ఆయన చిరాకుగా మొహం పెట్టి, "మా తమ్ముడి భార్య ప్రసవించింది. చాలా ప్రమాదం చేసింది. ఇది ఆరోకాన్పు. భార్యా భర్తలిద్దరికీ తోచనైనా తోచదు సరికదా మనం ఎంత చెప్పినా వినిపించుకోడు. మా మరదల్ని తలుచుకుంటే జాలికలుగుతుంది; ఆవేశంతో కోపంతో రక్తం వుడుకెక్కిపోతుంది. మాష్టారూ, ఆ పిల్ల పేరు లక్ష్మి అండి. అచ్చు లక్ష్మీదేవి అనుకోండి కానీ– ఇప్పుడు చూస్తే...... ఘోరం......సిరి వదిలి పోతే మిగిలిన దిష్టి బొమ్మలా వుంది. అనకూడదు గానీ ఆ పిల్ల వంట్లో ఎక్కడ చిదిమినా నెత్తురు కారదండీ నిజం...నీళ్ళు...మాష్టారూ, నీళ్ళు. కారతయ్. మనిషి పూర్తిగా పాలిపోయింది. వయస్సు తెలుసుకుంటే మరీ ఆశ్చర్యపోతారు..."

"ఎంతుంటుందేం ?" అప్రయత్నంగా అడిగేను.

"ఇరవై ఆరేళ్ళు...ఇంకోసంగతి తెలుసామీకు. మా తమ్ముడు కూడా నాలాగే ఎలిమెంటరీ స్కూల్ టీచరు. ఆ పిల్ల ఆరోగ్యం సంగతి అలా వుంచండి; ఆర్థికబాధలు మాత్రం... అబ్బ" అని ఒక్కసారి కళ్ళార్పి, "ఇలా విచక్షణా రహితంగా జనాభాని పెంచుకుంటూ పోవటం మనకు కష్టం కలిగించే మాటెలా వున్నా–మూర్తిగారూ దేశం గురించి ఆలోచిస్తే అదొక గొప్ప నేరమండీ. నిజం...... crime మాష్టారూ, crime" పరంధామయ్య ఆవేశపడ్డాడు.

ఆయన మాటలు వింటుంటే నా మనస్సు నా పరిస్థితిని గురించి ఆలోచించడం మొదలెట్టింది. నాకు నెలకు ఐదువందలు వస్తాయి. పెద్దగా ఆస్తిపాస్తులు లేకపోయినా ఆ జీతంతో నేనెంతో హాయిగానే జీవిస్తున్నాను. పదో పరకో వెనకేస్తున్నాను కూడా. నాకుముగ్గురు పిల్లలు. నాలుగోనెంబరు సిద్ధమవుతున్నది. ఆ పైన పిల్లల్ని కనటం నేరమేనా? నిజమే–నేరం. అయితే ఇక నేరం నేను చేయకూడదు. చేయకుండా వుండాలంటే?– శారద కళ్ళ ముందు మెదలింది. నామనస్సు పరిపరి విధాల పోసాగింది.

"నాకు పనుంది. వస్తాను మాష్టారూ, మరొకసారి కలుద్దాం." పరంధామయ్య వెళ్ళిపోయాడు.

ఆయన మాటలతో ఉలిక్కిపడి మామూలు స్థితి కొచ్చేను.

ఆ రాత్రి, నేను శారద ఒక నిర్ణయానికొచ్చేం.........

∴ ∴ ∴ ∴

మానెంబర్ ఫోర్ రవణకి ఏడాది నిండింది. నాకు గుడివాడ ట్రాన్స్‌ఫర్ అయింది.

యాంత్రికమైన జీవితం మరో ఆరు నెలల్ని వెనక్కు నెట్టింది.

కార్తీక మాసం సగంగడిచింది. మామిత్ర బృందమంతా కలిసి వనసమారాధన ఏర్పాటు చేశారు. నన్నూ అడిగేరు రమ్మని. నేను సరేనన్నాను.

ఆదివారం—

ఉదయం తొమ్మిది గంటలు దాటింది. బస్సుదిగి తోటలోకి నడిచేం. అప్పటికప్పుడే మాకోసం కాఫీ, టిఫిన్ సిద్ధంచేసేరు కార్యకర్తలు. క్షణాల్లో ఆ కార్యక్రమం ముగిసింది. జట్లు జట్లుగా మిత్రులంతా విడిపోయేరు. కొబ్బరి చెట్లక్రింద తలావొక చోటా చేరేరు. కొందరు పేకాట, కొంతమంది చదరంగం, మరికొందరు 'క్యారమ్స్' ఆటలో పడ్డారు. పేకాట సాగిస్తున్న వాళ్ళలో మాత్రం నాలుగు వర్గాలు ఏర్పడినై. ఒకవర్గం 'లిటరేచర్' మరోవర్గం జడ్డాట, మరొక పార్టీ ఇరుపది, ఇంకొక గ్రూపు రెండు–నాలుగు.

వీళ్ళందరికీ దూరంగా, ఉసిరి చెట్టుక్రింద నేనూ, డాక్టర్ రవీ కూర్చున్నాం. మేమిద్దరమూ ఏవర్గంలోనూ ఒదగలేనివాళ్ళం. అందుకే నేనూ, రవీ దినపత్రికల్ని చూసే కాలక్షేపంలో పడ్డాం.

"హల్లో మిష్టర్ మూర్తిగారూ" అన్న పిలుపుకు తలెత్తి చూశాను.

పరంధామయ్య గొడుగును ముడుస్తూ నాకేసి వచ్చేడు.

"రండి, రండి" ఆయన్ని ఆహ్వానిస్తూ, పేపర్ ప్రక్కన పడేసి సరిగా కూర్చున్నాను.

పరంధామయ్య చాపమీద కూర్చున్నాడు. పై పంచెతో ముఖాన పట్టిన చెమటని తుడుచుకున్నాడు. లాల్చీ గుండీని ఊడదీసి ఉఫ్ మని గాలి ఊదుకుంటూ అన్నాడు. "నేను రాలేను వదల్రా అంటే మా రామం ఊరుకోలేదు. నువ్వు రావల్సిందే అని పట్టుబట్టేడు. సరేనని పడుతూ లేస్తూ వచ్చాను."

రామం ఈ కార్యక్రమం నిర్వహిస్తున్న ముఖ్యమైనవ్యక్తి. పరంధామయ్య రామంకి బాగా తెలుసన్నమాట, అనుకున్నాను.

"అవును...మా బస్సులో రాలేకపోయారా?" అడిగేను.

"వద్దామనే అనుకున్నా. కానీ నేను నాలుగడుగులు వెనకయ్యే సరికి మీ బస్సు వచ్చేసింది. ఆ తర్వాత బస్సుకు వచ్చేను."

డాక్టర్ రవిని పరంధామయ్యకు పరిచయం చేసేను. మా సంభాషణ కార్తీకమాసం మీదికి, వన సమారాధన మీదకూ మళ్ళింది.

"ఇంతకీ భోజనంలో ఐటమ్స్ ఏమిటో" యథాలాపంగా అడిగేడు పరంధామయ్య. ఆయన చూపు అక్కడికి కొద్దిదూరంలో తయారవుతున్న వంటమీద నిలచింది.

రవి చిరునవ్వు నవ్వేడు. ఆ డాక్టరు తీరే అంత. వస్తుతహా ముభావపు తత్త్వం. ఎక్కువ మాట్లాడడు. ఎప్పుడన్నా ఇలా సన్నగా నవ్వుతూ ఆకాశంకేసి చూపులు సారిస్తూ వుంటాడు.

"అన్నీ నాకు తెలీవుగానీ, లడ్డూలు మాత్రం వుంటయ్." పత్రిక పుచ్చుకుంటూ అన్నాను.

"ఇంకేం, లడ్డూ వుంటే బూందీ వుంటుంది, ఆ రెండూ తల్లీ, పిల్లా లాంటివి" రవి అన్నాడు.

వెంటనే మొహం అదోలా పెట్టుకున్నాడు, పరంధామయ్య. మనస్సులోని చిరాకంతా ముఖరేఖల్లోకి వచ్చేసింది. "పిల్లల

సంగతిమాత్రం ప్రస్తావించకండి. రామేశ్వరం వెళ్ళినా శనేశ్వరం వదలట్టు" అన్నాడు.

రవి, నేనూ చకితులమైపోయాం.

పరంధామయ్య ఏదో చెప్పబోతున్న వాడల్లా తక్కున ఆగిపోయేడు. ఎదురుగా చూస్తూ ఆత్రంగా చేతిని ఆవైపు చూపేడు.

అప్పటికప్పుడే అక్కడ పెద్ద గుంపు చేరింది. మా మిత్రులు చాలామంది అటుగా పరిగెత్తసాగేరు. మేమూ లేచి వెళ్ళాం—హఠాత్తుగా.

సుమారు ఆరేళ్ళ పిల్లవాడు ఒక స్త్రీ చేతుల్లో స్పృహతప్పి పడిపోయివున్నాడు. అతని తలకి గాయమై రక్తం స్రవిస్తోంది. ఆమె లబోదిబోమని ఏడుస్తోంది. డాక్టర్ రవి ముందుకువెళ్ళి పిల్లవాణ్ణి పరీక్ష చేసేడు. కాళ్ళూచేతులూ సాఫీగా లాగిచూసేడు. తడిగుడ్డ తెప్పించి గాయానికి చుట్టేడు. "వెంటనే డాక్టర్ దగ్గరకి తీసుకుపొండి" అంటూ సలహా యిచ్చేడు.

ఆ స్త్రీ, మరోవ్యక్తి పిల్లవాణ్ణి తీసుకుని వెళ్ళిపోయారు.

అసలు సంగతి అప్పుడు తెలిసింది. వాడు గన్నేరుచెట్టెక్కి ఆడుకుంటున్నాట్ట. కొమ్మవిరిగి పడిపోయాడు. ఆస్త్రీ అతనితల్లిట. ఆమెతో వెళ్ళిన వ్యక్తి వాడి తండ్రిట. వాళ్ళకి మొత్తం ఎనిమిది మంది పిల్లలట. తల్లీ, తండ్రీ కూలి పని చేస్తారట.

పిల్లల్నీ, వాళ్ళ ఆటల్నీ గురించీ చర్చించుకుంటూ తిరిగి వచ్చేం.

పరంధామయ్య చాప మీద కూర్చుంటూ మొదలెట్టేడు. ఆ మొగుడూ పెళ్ళాల్ని చూడండి. ఎంత 'కేర్‌లెస్'గా బతుకుతున్నారో. వాళ్ళకి బాధ్యతలు తెలీవు—పిల్లల్ని కని పడేయటం తప్ప. ఏ పిల్లవాడు ఏంచేస్తున్నాడో, ఎక్కడున్నాడో పట్టించుకోరు. గాలికి వదిలేయటమే. ఇదంతా ఏమిటంటారు? నేరంకాదుటండీ. నేరంకాదూ......"

నేనూ, రవీ ఆయన కళ్ళలోకి సూటిగా చూడలేకపోయాం. ఆయన వుగ్రుడై వున్నాడు.

''నన్నడిగితే...''

''సార్ భోజనాలు రెడీ'' అంటూ వంట మనిషి హెచ్చరించేడు.

''మీరు చెప్పేదంతా యథార్థం పరంధామయ్య గారూ, లేవండి" అంటూ బూట్ల లేసులు విప్పసాగేడు రవి.

భోజనాల సమయంలోనూ, ఆ తర్వాతా కూడా పరంధామయ్య లోకంలోని చాలా మంది దంపతుల నిర్లక్ష్యాన్ని గురించే ముచ్చటించేడు.

పరంధామయ్య తనకేదో ముఖ్యమైన పని వుందంటూ రెండు గంటలకే వెళ్ళిపోయాడు.

*   *   *

మా ఇంటి యజమాని నాకు నోటీసిచ్చేడు, ఇల్లు ఖాళీ చెయ్యమని. ఆయన కూతురు పెళ్ళిని భారీ ఎత్తున జరిపించి, అల్లుణ్ణి ఇల్లరికం తెచ్చుకో బోతున్నాడు.

నేను ఇళ్ళకోసం వేట ప్రారంభించాను. నా స్నేహితుకొకతను తన నెరుగున్న వాళ్ళెవరో వున్నారని తీసికెళ్ళాడు.

అదొక పెద్ద మేడ. ఆవరణలో రెండువైపుల ఔట్‌హౌస్ లున్నాయి. క్రింద భాగం ఖాళీగా వుంచేన్నారు. చూశాము. నాకు నచ్చింది. అడ్వాన్సిచ్చి వచ్చాను.

నాలుగు రోజుల తర్వాత—

కుటుంబంతో సహా ఆ ఇంట్లో చేరాను.

ఆ రోజు సాయంత్రం—

వరండాలోని సామాను లోనికి తీసికెళుతున్న నేను ''హలో మాష్టరు'' అన్న మాటలకు తలెత్తి చూశాను.

చేతిలో గొడుగుని నేలకు తాటిస్తూ వస్తున్నాడు పరంధామయ్య.

"ఈ ఇంట్లో కెవరో వస్తున్నారంటే—ఎవరో అనుకున్నాను'' ఆయన వరండాలోకి వచ్చి నిలబడ్డాడు. "మీరీ ఇంటోకి రావడం నాకు చాలా ఆనందంగా వుంది. మనం తరచు కలుసుకుంటూ వుండవచ్చు. సాహిత్యంతో పరిచయమున్న మీతో నాకు బాగా కాలక్షేపం అవుతుంది. అదిగో అటుచూడండి. ఆ బావి ప్రక్క ఇంట్లోనే మా పెద్ద అమ్మాయి వాళ్ళు వుంటున్నారు. మేము ప్రక్క వీథిలోనే లెండి వుండటం. సామాను సర్దుకుంటున్నారిల్లే వుంది. రేపు వస్తాను. తీరిగ్గా మాట్లాడుకోవచ్చు.'' అంటూ వెనుదిరిగాడు పరంధామయ్య.

ఆ మర్నాడే శారద పిల్లల్ని తీసుకుని పుట్టింటికి వెళ్ళింది—వారం గడిచింది. ఈ వారంలో నాలుగైదు సార్లు కలిసేడు పరంధామయ్య. ఆయన వచ్చినప్పుడల్లా మా ఆవరణలో ఔట్ హౌసుల్లో వున్న సంసారాల్ని గురించీ, వాళ్ళ పిల్లల్ని గురించీ మాట్లాడేవాడు. దేశ భవిష్యత్తు గురించి బెంగపడేవాడు. అప్పుడప్పుడూ వాక్యాల్ని కూడ గట్టుకుంటూ పద్యాలు చెపూవుండే వాడు కూడా.

ఒక రోజు సాయంత్రం—

నేను ఆఫీసునుంచి ఇంటికొస్తున్నా. రోడ్డుమలుపులో సాయీ నర్సింగ్ హోమ్ దగ్గర నిలబడి వున్నాడు పరంధామయ్య. ఆయన ప్రక్కనే నిలబడి ఏదో మాట్లాడుతోంది వోయువతి. ఆమెకు ఇరవై యేళ్ళుంటాయి.

నన్ను చూసి విష్‌చేశాడు పరంధామయ్య. నేను ప్రతి నమస్కారం చేసి దగ్గరగా వెళ్ళి ఆగేను. ''ఏమిటి ఇక్కడ వున్నారు?"

''ఉండాలి మరి. కర్మ ఫలం తప్పుతుందా'' అని కొంచం వేదాంతాన్ని వొలక బోసేడు

ఆ అమ్మాయి సన్నగా నవ్వింది.

''ఏమిటీ విశేషం?'' అడిగేను.

అన్నట్టు ఈ పిల్ల మా రెండోది పేరు సునంద. బి.యే చదువుతోంది విశేషమేమిటో దాన్నే అడగండి'' అని చూపులు మరల్చుకున్నాడు పరంధామయ్య.

సునందని నేనేమీ అడగ లేదు. ఇంతలో పరంధామయ్య నన్ను ఆమెకు పరిచయం చేస్తూ చెప్పేడు.'' వీరు మూర్తిగారని ...మంచి క్రిటిక్. నాకు మరీ మంచి మిత్రుడు.'' ఆమె నాకు నమస్కారం చేసింది

క్షణాల తర్వాత ఆమె చెప్పింది. ''మా అమ్మని డెలివరీకి చేర్పించేమండీ. పురుడుతో బాటు ట్యూబెక్టమీ కూడా చేయించాం నిన్న.''

''ఆ, అంతా ఈ పిల్ల ఘనతే నండీ మూర్తిగారూ. వాళ్ళమ్మ ప్రాణం తోడుకు తిని దాన్ని ఆపరేషన్‌కి వొప్పించింది. కూతురు కేసి చూస్తూ నిష్ఠూరంగా అన్నాడు, పరంధామయ్య.

''గుడ్—బాగుంది. ఇంతకీ ఏం బిడ్డ?' అడిగేను.

''ఇంకేం బిడ్డ. నాలాంటి వాడికి పిలిస్తే పలికేది ఇంకెవరు—ఇనప గజ్జెల తల్లి ఆడ పిల్లే. పరంధామయ్య సమాధానంలో ఎంతో ఆవేదన వుంది; దాన్ని వెనక్కు నెట్టేస్తున్న అసహ్యంవుంది.

''కంగ్రాట్స్. ఆడ పిల్లంటే లక్ష్మిసార్. అలా అనకండి.'' అంటూ సెలవు తీసుకుని వచ్చేశాను

ఆ మర్నాడు—ఉదయం పది గంటలకు అదే స్థలంలో సునంద నాకు కనిపించింది. మేమిద్దరం వాళ్ళ అమ్మ ఆరోగ్యాన్ని గురించి కొంచం సేపు మాట్లాడుకున్నాం.

''మా అమ్మకిది పదకొండో కాన్పండి. చాలా నీరసంగా వుంది.'' అంది సునంద.

నేను స్తబ్ధుణ్ణయ్యేను. దేశ జనాభా గురించీ, భవిష్యత్తు గురించీ బెంగపడే పరంధామయ్య నా కళ్ళముందు మెదిలేడు

---

( 9వ పుటనుండి )

చేసి సత్వరంగా సమర్థవంతమగు చర్యలను గైకొనవలసిన సమయం ఆసన్నమైంది. పరిమిత కుటుంబ నియమము సిద్ధాంతమే కాదు. అది భారతీయులపాలిటి ఆపద్ధర్మము బిడ్డలు వరాల పంటలై వర్ధిల్లాలిగాని కన్నీటి ధారలకు కారణం కారాదు. పరిమిత కుటుంబ పథకము కేవలం పరిమిత సంతానానికే పరిమితం కాగూడదు నవదంపతుల ఆరోగ్యానికి, ఆనందానికి, ఐశ్వర్యానికి మూలకందమై విరాజిలాలి. వివాహాలు ఎప్పుడు జరగాలి, ఎవరికి జరగాలి, పిల్లలెప్పుడు కలగాలి, ఎందరు కలగాలి మొదలగు అంశాలన్నీ భారత దేశపు ఇంటింటా చెరగని ముద్రిలై నిలవాలి. దాంపత్య జీవన రహస్యం, సుఖసంసారపు సారం ఎప్పుడు ఎవరికి లభిస్తుంది అను విషయాలు ప్రతి యువతీయువకుడికి కరతలామలకమై భాసిల్లాలి ఇవన్నీ కుటుంబ నియంత్రణ ప్రచార భాగములుగా రూపొంది ఆచరణయందుంచబడాలి. భారత దేశంలోగల 900 లక్షల కుటుంబాలకు కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు అనవరతం అందుబాటులో ఉండాలి సినిమాల్లో, రేడియోల్లో, బస్సుల్లో, రైళ్ళల్లో, పోస్టర్లలో, క్యాలెండర్లలో, రేషన్ కార్డుల్లో, పత్రికల్లో, దుకాణాల్లో, బజార్లలో, ఎటు చూచినా పరిమిత కుటుంబ ప్రచారమే ప్రతిబింబించాలి పరివార ప్రబోధాలు పకడ్బందీగా, సహేతుకంగా, క్రమపంథాలో, నయనానందకరంగా, శ్రవణపేయంగా రూపొందాలి. గుద్దెద్దు చేలో పడ్డట్టు అన్ని చోట్లా, అన్ని సమయాల్లో ఒకే నినాదం నినదించకూడదు. దృష్టికీ, శ్రవణానికీ ఉన్న భేదాన్ని గుర్తించి నినాదాలు నిలవాలి గ్రామాల్లో సురక్షితులగు ప్రచారకులు నియమింపబడాలి. నిరక్షరాస్యుల్లో, సంకుచిత వర్గాల్లో పేరుకొనియున్న ఛాందస భావాలను తొలగించి వారిని దారికి తేగల అనుభవజ్ఞులు కుటుంబ నియంత్రణ ప్రచారకులుగా నియమింపబడాలి. ఆర్థిక యిబ్బందుల కారణంగానే వివాహ బంధాలు విడిపోతున్నాయని సోపపత్తికంగా విశదీకరించాలి. చాలీచాలని సంసారాల్లో సాలుకొక సంతానమవతరించడం వల్ల చల్లని కాపురాలు చిట్లిపోతున్నాయని ఉదహరించి ఉద్బోధించాలి. ఇలా వివాహితుల వయఃపరిమితి పాతిక వత్సరాలకు పొడిగించగలిగితే పుట్టుక శాతం 30 నుండి 12 వరకు తగ్గగలదు. ప్రస్తుతం దేశంలో ప్రబలియున్న నిరుద్యోగ సమస్యను నిర్మూలించాలన్నా, ఆహార సమస్యను అంతమొందించాలన్నా, నిరక్షరాస్యతను తొలగించాలన్నా, చతుర్థ ప్రణాళికకైన పెట్టుబడికి రెండింతలు కావలసి ఉంటుందని ఆర్థికవేత్తలు అంచనా వేశారు. అలాంటప్పుడు ప్రస్తుతం పెరుగుతున్న జనాభాకు సరిపోను అవసరమైన ఉద్యోగావకాశములను కలిగించడానికి ఎన్ని ప్రణాళికలు ఎంత పకడ్బందీగా ఎంతకాలం ఆచరణయందుంచవలసి ఉంటుందో ఊహించుకుంటే చాలు. ఈనాడు జనాభా సమస్య జాతి భవితవ్యానికి సంబంధించిన సమస్య. ఇది ప్రజల సమస్య.

కవిత

# కొత్త నెత్తురు

శివారెడ్డి

సుబ్రమణ్యం !
నిన్న నీవు వచ్చి
చచ్చి పోతానన్నావు
అంతకు ముందు నువ్వు
నా ప్రాణానికి ప్రాణం
అప్పుడు మాత్రం
నేనెంతో అసహ్యించుకునే
మనిషంత పెద్ద పురుగు వయ్యావు.
నాకు తెలుసు
కాసిని కష్టాల ఉప్పు నీళ్ళు తాగలేకనో
ఎదురు దెబ్బల గొడ్డుగారం మెతుకులు తినలేకనో
నువ్వా నిర్ణయాని కొచ్చావని___
నువ్వే కాదు
నీలాంటి వాళ్ళు చాలామంది
నా దగ్గర వాళ్ళ దుఃఖం విశ్వరూపాన్ని
ప్రదర్శించి, విరక్తి గీతాలు వినిపించి
వెడుతుంటారు :
నిజానికి వీళ్ళు చావరు___
నిత్యం చచ్చి, పోతూనే ఉంటారు
నేనెప్పుడో చెప్పాను
ఉరేసుకునేందుకైనా
కొంత ధైర్యం కావాలని
ఆపాటి ధైర్యం వీళ్ళకుంటే
నిక్షేపంగా బతికి పోదురు
నిజానికి మనమంతా
దుఃఖాశ్రయులమే

దురిత నిస్పృహ బాడ బానలాన్ని
ఇస్త్రీ మడతలు వేసి
దాచుకున్న వాళ్ళమే!
అంత మాత్రం చేత
జీవితాన్ని మోసం చేయలేం
సుబ్రమణ్యం!
నీలాంటి వాళ్ళందరూ
పిల్లి కుట్టిందని మంచాన్ని
పొయ్యిలో పెట్టే రకం
కోతిపుండును
బ్రహ్మరాక్షసి చేసుకుంటారు
అత్యల్ప విషయాన్ని
అనంతాలుగా చేస్తాయి
మీ భూతద్దాల కళ్ళు ;
'దుర్విధి' నిద్రమాత్రలు మింగుతూ
సహస్ర ముఖంగా వికసించే
జీవన పుష్పాన్ని చూడరు
ప్రపంచం కీకారణ్యంలో
ఎక్కడో గీచుకు పోతుంది
పొరపాటు ముల్లు
దాన్నే జీవితాంతం
మననం చేసుకోవటం
తెలివి తక్కువ కన్నా తెలివితక్కువ
సుఖాన్ని సూచించే దిక్సూచి ఆశ
దాని చూపు ఎప్పుడూ
బ్రతుకు పొద్దు పొడుపు వైపే !




## పారిజాతాలు

(కవితా సంకలనం)

రచయితలు : శ్రీయుతులు

**నెల్లుట్ల వెంకటేశ్వరరావు. దేవులపల్లి ప్రభాకరరావు, అవురుపల్లి మురళీధరరావు.**

ప్రచురణ : ప్రభ ప్రచురణలు, హైదరాబాదు.

పేజీలు 72, వెల : 3 రూపాయలు

ప్రతులకు : న్యూస్టేట్ ప్రింటర్స్, నారాయణ గూడ హైదరాబాదు

"నీవొక యప్సరః ప్రణయినీ కబరీచ్యుత పారిజాత మా
లా విసరంబవో, మరి యిలాతలమంట సుధా తుషార వ
ర్షా విమలావకుంఠనము జార్చుచు బోవు శరద్విభావరీ
దేవి లలాటికా మణివొ ! దీపికవో సురరాజ్యలక్ష్మికిన్"

అనే వేదులవారి పద్యములాంటి కవితలు చదివి ఒళ్ళు పరవశమైపోయి అదే సరియైన కవితామార్గమని యువకవులు ఆనాడు ఆనందించేవారు. ఆ రోజుల్లో ప్రేమ కవితారీతులకు తెలిసో తెలియకో ప్రజలు పెద్దపీట వేసి కూర్చోబెట్టారు. దానిపై అభ్యుదయ కవిత్వం తిరుగుబాటు చేసిన ఫలితంగా కవితలో సామాజిక చైతన్యానికీ, ప్రజాహిత దృక్పథానికీ ప్రాధాన్యం వచ్చింది. గత మూడు నాలుగు దశాబ్దాలుగా తెలుగు కవిత్వంలో అభ్యుదయ దృక్పథం బాగా వ్యాపించింది. సమాజంలో నానాటికీ అధికమవుతున్న ఆర్థిక వ్యత్యాసాలూ మొదలగు కారణాలవల్ల యువకవులు యింకా తీవ్రమైన భావ ప్రకటనకు ప్రయత్నిస్తున్న యీ రోజుల్లో యీ ముగ్గురు—యువకవులూ అచ్చమైన ప్రేమ కవిత్వం వ్రాసి ప్రకటించారు. ఇందులోని శీర్షికలన్నీ వచన కవితా ఖండికల రూపంలో వున్నవి. ఈ రూపభేదం తప్ప భావకవిత్వానికీ, యీ సంకలనంలోని కవితలకూ తేడా యేమీ కనిపించడంలేదు.

"ప్రేమమయీ, నీకు నమస్సు
ప్రియురాలా !
అందుకో కృతజ్ఞతకు
చిహ్నంగా
నా మనస్సు"...
"చెలీ !
నీవు ఆమనివి
ఎండిన గుండెలలో
నందనాల అందాలు సృష్టించే
అనురాగ సరాగాలు ప్రయోగించే
నాక ధునివి
రాగ ఝరివి."

—నెల్లుట్ల వెంకటేశ్వరరావు.

"దయచేసి ప్రతిరోజూ యిదేదారిన వెడుతూ వుండు
కనీసం నీ దర్శన భాగ్యమైనా కలిగించునాకు"
"శలవు చెలీ, శలవు శలవు
శలవు తీసుకొందునింక
నీ ప్రణయభాగ్య సీమలోన
నెలవుకొరకు
ఫలియించని నాతపస్సు
ప్రతిదిశలో తమస్సు"

—దేవులపల్లి ప్రభాకరరావు

"కళ్ళు పెద్దవే కానీ
కనికరం లేదేమి ? దేవీ ?
అందం వుంటేనే సరా ?
హృదయ స్పందనం ఉండాలి మరి"

—అవురుపల్లి మురళీధరరావు.

ఇలా వున్నాయి. యీ సంకలనంలోని కవితలు. మనస్సూ మనస్సూ, ఆమనీ సౌదామిని, శలవు, నెలవు, తపస్సు, తమస్సు, అందం, స్పందన వంటి శాబ్దిక చమత్కారాలు తప్ప వస్తుపరంగా యీ కవితలను గురించి విశేషంగా చెప్ప వలసింది ఏమీ లేదు.

అభ్యుదయ కవితోద్యమంలో ప్రధానపాత్ర వహించిన ఆరుద్ర "ముచ్చట" అనే శీర్షికతో యీ సంకలనానికి పీఠిక రాస్తూ యిలా అన్నారు.

"అయితే లోకంలో ఆకలి, చీకటి, దరిద్రం, దగా, మోసం, లేనివాళ్ళ వెతలు, ఉన్నవాళ్ళ దోపిడీ, యిలాంటి సామాజిక సత్యాలను ఉపేక్షించి, సామ్యవాద విప్లవానికి కృషి చేయకుండా, అభ్యుదయాన్ని ఆకాంక్షించే సందేశాలివ్వకుండా పలాయన ప్రాయమైన ప్రేమ గీతాలు పాడడం తప్పుకాదా ! అని ఆక్షేపణ రావచ్చు దానికి జవాబు ఒక్కటే. లోకంలో ప్రేమకూడా వుందిగా"

ముఖచిత్రం చూడటానికి ముచ్చటగా వున్నది. మూడు రూపాయల వెల కొంచెం ఎక్కువ అనిపిస్తుంది.

## బుుతచేతన

(వచన ఖండికలు)

రచయితలు : శ్రీయుతులు

### ఉమాపతి పద్మనాభశర్మ, రుక్మాభట్ల కృష్ణమూర్తి, జాలపల్లి చంద్రారెడ్డి, విఠాల శ్రీకాంతశర్మ

ప్రచురణ : చైతన్యభారతి, సిద్దిపేట 56 పేజీలు. వెల 2 రూ
ప్రతులకు : ఉమాపతి పద్మనాభశర్మ, పారుపల్లివీధి, సిద్దిపేట మెదక్‌జిల్లా.

కవితారంగంలో యిటీవల ముగ్గురు నలుగురు కవులు కలసి ప్రకటించుకుంటున్న సంకలనాలసంఖ్య క్రమేణా ఎక్కువవుతున్నది. కవిత్వానికి, గిరాకి లేకపోవడంకంటే ఒక్కొక్క కవి తన గ్రంథం ప్రకటించి నష్టపోవడంకంటే నలుగురుకలిస్తే నష్టం నాల్గవవంతు మాత్రమే తగ్గుతుందనే భావం దీనికి కారణం కావచ్చు. ఈ పద్ధతిని యిటీవలి కాలంలో అవలంబించి ప్రచారంలోకి తెచ్చినవారు చేతనావర్తం కవులు.

ఈ సంకలనంలో మొత్తం 27 ఖండికలు వున్నాయి. విచిత్రం ఏమంటే యీ నలుగురు కవుల్లో ఏ ఖండిక ఎవరురాశారో పాఠకులకు తెలియకుండా చేశారు. కీర్తి, అపకీర్తులు నలుగురూ సమానంగా పంచుకుంటారు కాబోలు. ఇటువంటి సమిష్టి తత్వం మరే సంకలనంలోనూ కనిపించదు వ్యక్తి పూర్తిగా సమిష్టికి లొంగి పోయిన పరిస్థితి యిది. ఎవరు ఏదిరాశారో తెలియకుండా జంటకవులు లోగడ వున్నారుగాని అంతకుమించిన సంఖ్యలో ఎవరూ ఏదీ ప్రకటించలేదు.

ఈ నలుగురు కవులూ కావ్య వస్తు స్వీకరణలో సంపూర్ణమైన సామాజిక చైతన్యం కలిగినవారు. ''మనిషి'' అనే ఖండికలో ఒక కవి తాను రాస్తున్నది మనిషిని గురించి కాదనీ ఏనాడో అతనిని వీడిపోయిన చైతన్యాన్ని గురించి అనీ చెప్తాడు.

''దేవతార్చన'' అనే ఖండికలో ఒక కవి దేవుణ్ణి అనేక లోపాలు చూపి వేళాకోళం చేసి వెక్కిరిస్తాడు.

''పొగడ్తలకుబ్బిపోయే
కానుకల లంచాలకి లొంగిపోయే
నీవు —— ?
మా ఆఫీసరుకంటే ఏం గొప్పవాడవు''

అని ఎదురు తిరిగి ప్రశ్నిస్తాడు.

మరొక ఖండికలో

''కుళీరం నా నడకకు ప్రమాణం
గుండ్రంగా తిరగడమే నా ప్రమాణం
చైతన్య భావం నాకు గిట్టదు
మానవతావాదం తిండి పెట్టదు
ఒక్కటిమాత్రం నేర్చుకున్నాను
చక్కగా నా బ్రతుకు నేను బ్రతకడం
చిరిగిపోతున్న పాత భావాలను
చిత్రంగా చేర్చి అతకడం
పుచ్చిపోయిన పురాణాలను వల్లె వేసుకుంటూ
చచ్చిపోయిన భగవంతుణ్ణి స్మరించుకుంటూ పరవశిస్తాను''

అంటూ నేటి మానవునిలోని స్వార్థాన్ని వ్యంగ్యంగా ఎత్తిచూపుతాడు, "ఉపమానాలు" అనే ఖండికలో మచ్చుకు కొన్ని మంచి ఉపమానాలు :

''ఆషాఢ ఎండకు కరిగిన తారు రోడ్డులావుంది బ్రతుకు''
''భక్తుల కొరకు ఎదురుచూసే పూజారివలెవుంది ఆశ''
''రోడ్లవెంట తిరిగే రౌడీవెధవలా వుంది బుద్ధి''

ఒక ఖండికలో కవి తన ప్రేయసిని సంబోధించి కూడా— ''మూఢ విశ్వాసాల ముళ్ళకంపలో నీవు నడవలేవు ఆదర్శాలను వల్లె వేయడం తప్ప ఆచరించడం తెలియని కార్యశూన్యులు వీరు. నీతి పాఠాలు చెప్పే నాయకులు నేతి బీరకాయలు. అందువల్ల యీ ప్రపంచంలో అడుగిడకు" అని ప్రబోధిస్తాడు.

ఏ ఖండికలో చూచినా సామాజిక స్పృహ, వాస్తవికత కనిపిస్తాయి. ఈ నలుగురు కవులూ చాలాభాగం వచనకవితా పద్ధతికి బాగా చేయితిరిగిన వారుగా కనిపిస్తారు యువకవులందరూ ముఖ్యంగా చదువదగిన సంకలనం.

## పాండురంగ సూక్తులు

కవి **ఎస్. పాండురంగ శర్మ**

[ వెల రూపాయి ] జి. ప. ఉన్నత పాఠశాల, కామారెడ్డి, నిజామాబాదు జిల్లా.

ఇది 108 పద్యముల శతకము. కవిత వేమన, సుమతి శతకాల్లోలాగా సరళంగా వుంది. " పాండురంగ సూక్తి పండితోక్తి " అని మకుటం నేటి సాంఘిక పరిస్థితులను స్పృశించి కవి గారు అనేక చోట్ల విమర్శించారు. పొట్టి బుష్‌షర్టులు, యిరుకు పాంట్లు ప్యాషన్‌గా చేసికొన్న విద్యార్థులు, సినిమా నటీ నటులు, స్వార్థపరులైన రాజకీయ నాయకులు, పేకాట ఆడువారు వీరి విమర్శకు గురి అయినారు. "కడుపు నింపలేక కన్నీరు కార్చుచు, కూడు గుడ్డలేక కుములు బీద, తిన్న దరుగ లేక తిరుగురా ధనికుండు" అని బీదలపట్ల జాలి వెలిబుచ్చారు. కాపీ కొట్టే విద్యార్థి, కల్లు త్రాగిన వాడు—యీ యిద్దరికీ వారి కండ్లే సాక్ష్యంగా వుంటాయని, ఒకచోట చమత్కరించారు హాస్యము. విమర్శా, చక్కగా కలిసిన శతకం.

—చైతన్య

# తెలుగువారి సంగీత ప్రతిభ

( 22వ పేజీ నుండి )

సంగమేశ్వరశాస్త్రిగారు విశ్వ విఖ్యాతికి మూడు పర్యాయములు శాంతినికేతనము దర్శించినారు. ఒకనాడు అప్పటి బెంగాలు గవర్నరు సర్. రొనాల్డుషా శాంతి నికేతనమునకు రాగా విశ్వకవి శాస్త్రిగారిని పరిచయము చేయుచు వారు మా గురువులు ఇది (వీణను) మా జాతీయ వాయిద్యమని వర్ణించారు. విశ్వకవిచే గురువుగా కొనియాడబడిన గౌరవము మన తెలుగువాడైన తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారికి దక్కింది. విశ్వకవి సలహాను పాటించి అమెరికాకు శాస్త్రిగారు వెళ్ళిన మన తెలుగు వారి కీర్తి అనేకులకు తెలిసేది. ఛాందసులైన శాస్త్రిగారు విదేశ యాత్రకు వెళ్ళుటకు ఒప్పుకొనలేదు.

సంగమేశ్వరశాస్త్రిగారి తర్వాత సంగీత ప్రపంచమున తెలుగు దేశమున వెలసిన ధ్రువ తారలలో విజయవాడ వాస్తవ్యులై గాయక సార్వభౌమ బిరుదాంకితులై బహు సన్మానములు పొందిన పారుపల్లి రామకృష్ణయ్యగారు. బందరు వాస్తవ్యులై గాన కళా విశారదులుగా వాసికెక్కిన హరినాగభూషణంగారు. విజయనగరము మహారాజావారి సంగీత కళాశాలకు అధ్యక్షులై, కళాప్రపూర్ణ, పద్మశ్రీ సంగీత రత్నాకర యిత్యాది బిరుదాంకితులై భారత తొలి రాష్ట్రపతి బాబు రాజేంద్రప్రసాద్ ప్రశంసల నందిన ద్వారం వెంకటస్వామి నాయుడుగారు, మద్రాసు వాస్తవ్యులైన ఈమని బ్రహ్మయ్యగార్లు చిరస్మరణీయులు.

మార్దంగికాచార్య బిరుదాంకితులైన అశ్వథాటి రామమూర్తి మృదంగ కేసరి నామధేయులైన వాసిరాసి ఘంటయ్యశాస్త్రి: వారణాసి రామసుబ్బయ్య, ద్వారం నరసింగరావు, పత్రాయిని సీతారామశాస్త్రి: బొక్కా శ్రీరామమూర్తి, సుసర్ల గంగాధరశాస్త్రి సంగీత విద్వత్తునందు ఘనులైన ప్రముఖులు.

రాజకీయములందు సాంఘిక సేవాపరాయణత్వమునందు పేరు పడిన కీ. శే ఆచంట రుక్మిణమ్మ ( 391_1961 ) గారు, వీణా వాయిద్యమునందును ప్రముఖురాలు. లండన్ మహా నగరములోని ప్రజ్ఞాశాలి వీణా వాయిద్య మొనరించి తెలుగు జాతికి ఖ్యాతి తెచ్చిన తెలుగువారి ఆడబడుచు.

వర్తమానకాలమున బహుముఖ ప్రజ్ఞావంతులైన పద్మశ్రీ మంగళంపల్లి బాల మురళీకృష్ణ, పద్మశ్రీ ఘంటసాల వేంకటేశ్వరరావు, పద్మశ్రీ శ్రీమతి భానుమతిగార్లు, గాయక శిఖామణులుగా యావత్ భారతమున గౌరవింపబడుచున్నారు.

సంగీతశాస్త్ర గ్రంథ రచయితలలో శ్రీ అరిపిరాల సత్యన్నారాయణ, ధర్మాల రామమూర్తి, యిత్యాదులు కొందరు ప్రశంసార్హులు.

డాక్టరు శ్రీపాద పినాకపాణి, నేదునూరి కృష్ణమూర్తి, వాసా కృష్ణమూర్తి, ఈమని శంకరశాస్త్రి: ఓలేటి వెంకటేశ్వర్లు, మూకల చిన్న సత్యనారాయణ: నోరి నాగభూషణం, చిత్తూరు సుబ్రహ్మణ్య పిళ్ళే, వి. కమలాకరరావు, కోలంకి వేంకటరాజు: యన్. సి. వి. జగన్నాధాచార్యులు, సాలూరు రాజేశ్వరరావు, పిచ్చి హరి ; శ్రీమతి పి. సుశీల ; కుమారి శ్రీ రంగం గోపాలకృష్ణ కుమారి కనకదుర్గ కుమారి విజయమూర్తి లక్ష్మి; కుమారి టంగుటూరు సూర్యకుమారి, అన్నవరపు రామస్వామి, ఎల్లా వేంకటేశ్వరరావు చిన్నమోలీ సాహేబు యమ్. ఎస్. బాలసు బ్రహ్మణ్యశర్మ, దత్తాడ పాండురంగరాజు ; నేతి శ్రీరామశర్మ, పాలగుమ్మి విశ్వనాథం మొదలుగాగల వారెందరో వర్ధమాన కాలమున తమగాన వాయిద్య విశేష ప్రజ్ఞలచే తెలుగుజాతి కలంకార ప్రాయులుగానున్న మణిపూసలు.

"తెలుగువాడు అటుకర్నాటక సంగీతములోనే కాక ఇటు హిందుస్థానీ సంగీతములోను అందెవేసిన చేయి అని శ్రీ ఏల్చూరి విజయరాఘవరావు వంటివారు నిరూపిస్తున్నారు. హిందుస్థానీ బాణీ గాత్రసంగీతములోను, తెలుగుదేశవాసులు ముందంజవేశారని మహబూబ్‌నగర్ వాస్తవ్యులు శ్రీ మాణిక్యరావు రాయచూర్‌కర్ ఇటీవల ఋజువుచేశారు." (ఆంధ్రజ్యోతి 19_5_71లోని ఏ. రామ సంజీవరావుగారి "యమునా తీరే" నుండి గ్రహింపబడినది.)

హైద్రాబాదు, సికింద్రాబాదు, విజయవాడ, విజయనగరములలో ప్రభుత్వ నిర్వహణలోనున్న సంగీత కళాశాలలు కలవు. తిరుపతిలోని కళాశాలను తిరుపతి దేవస్థానము వారు నిర్వహించుచున్నారు. అంతే కాక రాష్ట్రములో చాల పట్టణములలో సంగీత పాఠశాలలు, కళాశాలలు ఉదారులచే నిర్వహింపబడుచున్నవి.

1957వ సంవత్సరమున ప్రభుత్వమువారిచే సంగీత నాటక అకాడమీ ఏర్పాటుచేయబడినది. అప్పటి ముఖ్యమంత్రి డాక్టరు నీలం సంజీవరెడ్డి, విద్యాశాఖామాత్యులు శ్రీ బులుసు ప్రభాకర పట్టాభిరామారావు మహోదయులు అకాడమీ స్థాపనకు మూల కారకులు. సంగీత సాహిత్యములలో నిష్ణాతులైన న్యాయమూర్తి పాకాల వేంకట రాజమన్నారు అకాడమీని ప్రారంభించిరి.

రాష్ట్రమున ప్రతి పట్టణములోను సంగీత సభలు కలవు. అందు విజయవాడలో ఈ సభలు మిక్కుటముగానున్నవి.

---

# జిల్లాల్లో

## కరువు పరిస్థితులలో ప్రజలకు ప్రభుత్వ సహాయం

ఉపముఖ్యమంత్రి శ్రీ బి.వి. సుబ్బారెడ్డి, మహబూబు నగరం జిల్లా పరిషత్తు హాలులో ఏర్పాటైన అధికారుల, అనధికారుల సమావేశంలో ప్రసంగిస్తూ అసాధారణంగా వున్న దుర్భిక్ష పరిస్థితులను ఎదుర్కొనే విషయంలో ప్రభుత్వం ప్రజలకు అండగా ఉండగలదని హామీ యిచ్చారు. ప్రజల అవసరాలను ఆదుకొనడానికై ప్రభుత్వం అవసరమైన సహాయక చర్యలు తీసుకొనగలదని ఆయన చెప్పారు.

ఉపముఖ్యమంత్రి జిల్లాలో ఏర్పడిన దుర్భిక్ష పరిస్థితులను పరిశీలించారు. ఈ విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చి జిల్లాకు అవసరమైన నిధులు మంజూరు చేయడానికి తగిన ప్రయత్నం చేయగలనని ఆయన చెప్పారు. శిస్తు, రెవిన్యూ విషయంలో రెమిషన్ యివ్వాలని స్థానిక ప్రజలు ఉపముఖ్యమంత్రిని అభ్యర్థించారు. కలెక్టరు యీ విషయంలో తగిన సిఫారసు చేసినట్లయితే ప్రభుత్వం సానుభూతితో తగిన చర్యలు తీసుకొనగలదని చెప్పారు. ఈ విషయంలో ప్రతిపాదనలు ప్రభుత్వానికి పంపవలసినదని ఆయన కలెక్టరును కోరారు. రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధి పరచడానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు దృఢసంకల్పంతో కృషి చేయగలవని ఆయన చెప్పారు. అంతకుముందు ఉపముఖ్యమంత్రి జాతీయ సమైక్యతా ప్రతిజ్ఞను గురించి ప్రమాణం చేయించారు.

జిల్లాపరిషత్ అధ్యక్షులు శ్రీ కె. కె. రెడ్డి ఉప ముఖ్యమంత్రికి స్వాగతం చెబుతూ జిల్లాలో ప్రజలకు జీవనోపాధి కల్పించి కరువు సహాయక పనులు జరపడానికి జిల్లాకు రూ. 75 లక్షలు అవసరమౌతాయని చెప్పారు. ఖరీఫ్ పంట పూర్తిగా చెడిపోయిందని చెరువులలో నీళ్ళు లేనందు వల్ల రాబీ పంట వేయడానికి కూడా అవకాశాలు లేవని ఆయన తెలిపారు.

సమితుల అధ్యక్షులు, కొంత మంది శాసన సభ్యులు ఉపముఖ్యమంత్రికి జిల్లాలో కరువు పరిస్థితులను గురించి వివరించారు. ప్రస్తుతం చౌకధరల దుకాణాలు తగినన్ని లేవని, బావులు లోతుగా త్రవ్వించడానికి కేటాయించిన నిధులు సరిపోవని వారు ఆయనకు చెప్పారు.

## పాఠశాల భవనానికి శంకుస్థాపన

నల్లగొండ జిల్లా, రామన్నపేట పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ అనంతరెడ్డి చౌటుప్పల గ్రామంలో పాఠశాల భవనానికి శంకుస్థాపన చేశారు. బలహీన వర్గాలవారి సంక్షేమం కొరకు, హరిజన బాలుర విద్యాభివృద్ధి కొరకు ప్రభుత్వం కల్పించిన అవకాశాలను గురించి ఆయన వివరించి చెప్పారు. గ్రామంలోని నవ యువక సంఘం అధ్యక్షుడు శ్రీ బి. రాఘవరెడ్డి, పాఠశాల భవనం కొరకు స్థలాన్ని విరాళంగా యిచ్చారు. హరిజన దినోత్సవ సందర్భంగా ఏర్పాటుచేసిన పోటీలలో గెలుపొందిన వారికి సమితి అధ్యక్షుడు బహుమతులను పంపిణీ చేశారు.

## వరంగల్లులో నీటి సరఫరా నిమిత్తం నిధుల మంజూరీకి మంత్రి హామీ

గృహనిర్మాణ శాఖా మంత్రి శ్రీ సి. రాజనరసింహ, అక్టోబరు 11న వరంగల్లులో జిల్లాపరిషత్తు సభ్యుల సమావేశంలో ప్రసంగిస్తూ వర్షాలు లేవి కారణంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటా కరువు పరిస్థితుల్ని ఎదుర్కొంటున్నారని అన్నారు. జిల్లాలో వ్యవసాయ కూలీలకు ఉపాధికల్పించే నిమిత్తం గ్రామాలలో చేపట్టిన వివిధ పథకాల అమలుతీరుకు మంత్రి సంతృప్తి వ్యక్తం చేశారు. ఆపత్కాల ఋణాలను జాప్యంలేకుండా మంజూరుచేసి గ్రామాలలోనే అక్కడికక్కడ పంపిణీచేయాలని కలక్టరుకు విజ్ఞప్తి చేశారు. జిల్లాలో కరువు పరిస్థితులను ఎదుర్కొనడానికి రు. 50 లక్షలు అవసరమవుతాయని మంత్రి అభిప్రాయపడుతూ వరంగల్లు మునిసిపాలిటీకి రు. 2.5 లక్షలు విడుదలచేయడానికి చర్యలు తీసుకోబడ్తాయని హామీ యిచ్చారు.

అంతకుముందు ఇన్చార్జి కలక్టరు ప్రసంగిస్తూ జిల్లాలో కరువు పరిస్థితులను గూర్చి వ్యవసాయ కూలీలకు కల్పించిన ఉపాధి సౌకర్యాలను గూర్చిన పనులను సమీక్షించారు. ఆలస్యంగా వరినాట్లు వేసిన కారణంగా నాలుగు అణాల పంట కూడా ఉత్పత్తి కావడం కష్టమేనని ఆయన అన్నారు. ఇంతవరకు అవసరమైన రైతులకు రు 12 లక్షల మేరకు టక్కావీ ఋణాలు మంజూరు చేశారు. జిల్లాకు కేటాయించిన మొత్తం రూ. 20 లక్షలలో యింతవరకు 75 శాతం మేరకు ఖర్చుచేయడం జరిగిందని కలక్టరు వెల్లడించారు. మునిసిపాలిటీలో ప్రస్తుతం ఉన్న 27 బోరింగు బావులు, 16 బావుల త్రవ్వకానికీ మరో 5 కొత్త బావుల త్రవ్వకానికీ రు 3.11 లక్షలు తక్షణమే అవుసరమని ఆయన అన్నారు. దీనికితోడు జనగామ మునిసిపాలిటీకి రు. 93,000/-లు అవుసరమవుతాయని కూడా ఆయన అన్నారు.

జిల్లాపరిషత్తు అధ్యక్షుడు శ్రీ బి. జగన్నాథరెడ్డి ప్రసంగిస్తూ రెండు మూడు గ్రామాలలో కనీసం ఒకపని అయినా చేపట్టాలనీ, ప్రతి వి.ఎల్. డబ్ల్యు సర్కిల్‌లో ఒక చౌకధర దుకాణం చొప్పున ప్రారంభించాలని ఆయన మంత్రికి విజ్ఞప్తి చేశారు.

మునిసిపల్ అధ్యక్షుడు, శ్రీ ఉమారెడ్డి ప్రసంగిస్తూ మునిసిపాలిటీలో జరుగుతున్న మంచినీటి సరఫరాను సమీక్షించారు. తక్షణమే రు. 6.5లక్షలు విడుదలచేయాలని మంత్రికి విజ్ఞప్తిచేశారు.

అంతకు ముందు మంత్రి కలక్టరు, జిల్లా పరిషత్తు అధ్యక్షుడు, యితర అధికారులు, అనధికారులతో కలిసి కొమ్మాల, సిద్దెంకి, పెదపెండాల గ్రామాలలో పర్యటించి పరిస్థితులను స్వయంగా తిలకించారు.

## ఆంధ్రప్రదేశ్‌లో మత్స్య పరిశ్రమాభివృద్ధి పథకానికి రూ. 4.5 కోట్లు

శ్రీకాకుళం జిల్లాలోని కళింగ పట్టణంలో బెస్తవారి సమావేశంలో అక్టోబరు 12న మత్స్యశాఖా మంత్రి శ్రీ కాకాని వెంకటరత్నం ప్రసంగిస్తూ ప్రభుత్వం యీ పథకం క్రింద బెస్తవారికి వలలు, పడవలు, కమ్యూనికేషన్ సౌకర్యాలు కల్పించడంతో పాటు వారుపట్టే చేపలకు మార్కెట్టులో తగినధరలులభించే విధంగా సౌకర్యాలు కలుగజేస్తారని తెలిపారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్రప్రభుత్వంతో సంప్రదించి రూ. 4.5 కోట్ల పథకం క్రింద బెస్తవారికి కమ్యూనికేషన్లు, యిండ్ల సౌకర్యం కలుగజేస్తారని ఆయన చెప్పారు. కాకినాడలో తయారుచేయబడిన 40 పడవలను బెస్తవారికి 15 రోజులలోనే సరఫరాచేస్తారని ఆయన ప్రకటించారు. తూర్పుకోస్తా ప్రాంతంలో బెస్తవారికి మంచి భవిష్యత్తు ఉందని తెలిపారు. ఢిల్లీలోని యూనియన్ కార్బో కంపెనీ వంటి అనేక సంస్థలు మత్స్య పరిశ్రమాభివృద్ధికి పెద్దమొత్తం పెట్టుబడులు కేటాయించడానికి ముందంజ వేస్తున్నాయని ఆయన చెప్పారు. వ్యవసాయదారులు, బెస్తవారు ఎస్.ఎఫ్.డి పనుల్ని సద్వినియోగం చేసుకోవాలని, యితరపథకాలవల్ల పాలకేంద్రాలను, కోళ్ళ పెంపకం కేంద్రాలను ఆర్థికంగా పెంపొందించాలని ఆయన తెలిపారు. శ్రీకాకుళం జిల్లాలో మత్స్య పరిశ్రమాభివృద్ధి పథకం క్రింద ఐదుగురు బెస్తవారు లాభంపొందారని జిల్లాకలెక్టరు చెప్పారు. ఈ సంవత్సరం కూడా 2 లేక మూడు మంది బెస్తవారికి యాంత్రిక పడవలు నడపడానికి సౌకర్యాలు కలుగజేయాలని, తగిన విధంగా ఆర్థిక సహాయం కూడా చేయాలని కలక్టరు మంత్రినికోరారు.

ఈ సమావేశానికి శాసన సభ్యులు శ్రీ టి సత్యనారాయణ అధ్యక్షత వహించారు.

## గిరిజన సహకార కార్పొరేషన్ ప్రారంభోత్సవం

చిత్తూరు జిల్లాలోని రెడ్‌క్రాస్ భవనంలో యిటీవల ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర గిరిజన సహకార కార్పొరేషన్‌కు సంబంధించిన బ్రాంచిడిపోకు జిల్లా కలక్టరు శ్రీ బి వి. రామారావు ప్రారంభోత్సవం చేశారు. ఈ జిల్లాలో గిరిజన కార్పొరేషన్ క్రింద ప్రారంభించబడిన మొట్టమొదటి డిపో యిదే అని కలెక్టరు తెలిపారు. గృహఅవసరాల సరఫరా నిమిత్తం మరో రెండు డిపోలు శ్రీకాకుళం తాలూకాలోని మెలచూరు కాలనీలోను, పుంగనూరు తాలూకాలోని సుగాలీ మిట్టలోను ప్రారంభిస్తారని ఆయన చెప్పారు.

## స్వల్పకాలిక వంగడాలను వినియోగించాలి

పశ్చిమ గోదావరి జిల్లా కలక్టరు శ్రీ ఎస్. ఆర్. గోవిందరాజన్, గత శనివారంనాడు పోలవరంలో జిల్లాఅభివృద్ధి మండలి సమావేశంలో ప్రసంగిస్తూ ఏజన్సీ ప్రాంతంలో ఆహార ధాన్యాలకు చెందిన అధిక రాలుబడిగల స్వల్పకాలిక వంగడాలను వినియోగించాల్సిన అవసరాన్ని గూర్చి నొక్కి చెప్పారు.

పురాతనమైన సంప్రదాయకమైన సేద్యపు పద్ధతుల స్థానములో ఆధునిక వ్యవసాయ పద్ధతులను చేపట్టాలని ఆయన సూచించారు. అరుణ ఆముదం, సంకరజాతి జొన్న, మొక్కజొన్న విత్తనాలను ప్రాచుర్యంలోకి తేవడానికి కృషి జరగాలి పోలవరంలో త్వరలోనే కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాన్ని ఏర్పాటు చేస్తారని కలక్టరు అన్నారు. పోలవరంలో రూ. 25,000/-ల ఖర్చుతో పశుశాలల ఆసుపత్రి భవనాన్ని, రూ. 10,000 ల ఖర్చుతో పశువైద్యశాలను తూటిగుంటలో ఏర్పాటు చేయడానికి నిర్ణయించబడిందని ఆయన అన్నారు.

సమితి ప్రాంతంలో గిరిజన సంక్షేమ పథకాల క్రింద అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ, గ్రామీణచర్మ, తాటినార పరిశ్రమలను నెలకొల్పడానికి స్థలాన్ని ఎంపికచేయాలని ప్రతిపాదించారని ఆయనఅన్నారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ ఎ. బాపినీడు ప్రసంగిస్తూ పంగిడిలో రూ. 30 లక్షల ఖర్చుతో పాల శీతల కేంద్రాన్ని ఏర్పాటు చేయాల్సిన అవసరాన్ని గూర్చి నొక్కి చెప్పారు.

## హయాత్‌నగర్‌లో కుటుంబ నియంత్రణ

రాష్ట్ర ఆరోగ్య, వైద్యశాఖమంత్రి శ్రీ ఇబ్రహీం అలీ అన్సారీ, అక్టోబరు 20న హయాత్‌నగర్‌లో టుబెక్టమీ శిబిర నిర్వహణ ముగింపు సందర్భంలో స్నాతకోపన్యాసం యిస్తూ కుటుంబ నియంత్రణ కార్యక్రమం విషయంలో హైదరాబాదుజిల్లా బాగా కృషి చేసినందుకు వారిని మెచ్చుకున్నారు. ఇటువంటి కార్యక్రమాలకు ప్రజలలో ప్రాచుర్యం లభించడానికి స్థానిక నాయకుల నిరంతర సహకారం చాలా అవసరమని ఆయన అన్నారు. ఇంతవరకు జరిగిన కృషికి మంత్రి తమ సంతృప్తిని వెల్లడిస్తూ యింకా మంచి ఫలితాలు సాధించడానికి సిబ్బంది మరికొంత ఆసక్తితో కృషి చేయాలని ఆయన అభిప్రాయ పడినారు.

జిల్లాకలక్టరు శ్రీ టి. లక్ష్మారెడ్డి సభకు అధ్యక్షతవహించారు.

వైద్య ఆరోగ్యశాఖ డైరెక్టరు డా. కె. రమేష్‌పాటిల్, క్షేత్ర సిబ్బందికి బహుమతులు ప్రదానం చేశారు.

## శిశుసంక్షేమ భవనానికి ఒకలక్ష రూపాయలు

తణుకులో లక్షరూపాయాల ఖర్చుతో శిశుసంక్షేమ భవనాన్ని నిర్మించడానికి పశ్చిమగోదావరి జిల్లా పరిషత్తు తీర్మానించింది. శ్రీ వై. నారాయణ రావుగారు భవనానికి స్థలాన్ని విరాళంగా యిచ్చారు. జిల్లా పరిషత్తు, జిల్లా సంక్షేమ నిధినుంచి లభించే ఆర్థిక సహాయంతోను, ప్రజల విరాళాలతోను యీ భవనం నిర్మించబడుతుంది. పెరవలి పంచాయితీ సమితి అధ్యక్షులు మృత్యుంజయరావు రూ. 10 వేల వరకు విరాళాలు సేకరించారు. సామాజికాభివృద్ధి వారోత్సవాల సందర్భంలో 16 హరిజన వాడలలో విద్యుత్ సౌకర్యాలు ఏర్పాటు చేయడానికి సాంఘిక సంక్షేమస్థాయీ సంఘం రూ. 16,855 లు మంజూరుచేసింది. ఇదివరకే విద్యుత్ సౌకర్యాలున్న గ్రామాలలో హరిజన వాడలలో విద్యుత్ సౌకర్యాలు కల్పించడానికి ఖర్చుకాకుండా మిగిలిపోయిన సుమారు లక్ష రూపాయలను విడుదల చేయవలసిందని పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. ఆర్ గోవిందరాజన్ సాంఘిక సంక్షేమశాఖా డైరెక్టరును కోరారు. ఆచంటలో సాంఘిక సంక్షేమశాఖ బాలికల హాస్టలుకు

ఆదనంగా కొన్ని గదులను నిర్మించడానికి రూ 38,500 లు మంజూరు చేయడానికి స్థాయీసంఘం ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

అత్తిలిలోని జిల్లా పరిషత్తు హైస్కూలును ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొని దానిని వర్తమాన విద్యా సంవత్సరంలో జూనియర్ కాలేజిగా మార్చాలని జిల్లా పరిషత్తు ప్రభుత్వాన్ని అభ్యర్థించింది నాలుగు ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు, ఐదు కుటుంబనియంత్రణ ఉపకేంద్రాల నిర్మాణం చురుకుగా కొనసాగుతున్నదని జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి తెలిపారు. రసాయనిక ఎరువుల కొనుగోలుకు రైతులకు స్వల్పకాలిక ఋణాలిచ్చే నిమిత్తమై పంచాయితీ సమితులకు రూ 10 లక్షలు మంజూరు చేయబడినాయి క్రిమిసంహారక మందులు కొనడానికి రూ 50,000 మంజూరు చేయబడినాయి

## చిత్తూరులో హరిజనులకు 2,000ల ఇండ్లు

చిత్తూరు జిల్లాలో హరిజన గిరిజన ప్రజల కొరకు యీ సంవత్సరం 2,000 యిండ్లు నిర్మించబడుతాయని జిల్లా కలెక్టరు శ్రీ బి. ఎ రామారావు చెప్పారు

జీవితభీమా సంస్థ గృహనిర్మాణం కొరకు రూ 11 కోట్లు కేటాయించింది యీ మొత్తంలోనుండి చిత్తూరు జిల్లాకు రూ 45 నుంచి 50 లక్షలవరకు కేటాయించబడుతుందని ఆయన చెప్పారు

## అనంతపురం జిల్లాలో శాశ్వత కరువు నివారణ పనులకు విజ్ఞప్తి

వైద్య ఆరోగ్యశాఖా మంత్రి శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ యిటీవల అనంతపురం జిల్లాలో పర్యటించి జిల్లా పరిషత్తులో అధికారులు, అనధికారులతో కరువు సహాయక పనులను గూర్చి చర్చలు జరిపారు

కరువు సహాయక పనులకు అవసరమైన నిధులు మంజూరు చేయడానికి ప్రభుత్వం కృషిచేస్తున్నదని ఆయన చెప్పారు పనులకు చెల్లించవలసిన షెడ్యూలు రేట్లు చాలా తక్కువగా ఉన్నాయని అందరూ ఫిర్యాదులు చేస్తున్నారు ఈ రేట్లను సవరించడానికి ప్రభుత్వస్థాయిలో కృషిచేయగలమని మంత్రి చెప్పారు అనంతపురం జిల్లాలో మొత్తం మీద 350 చౌకధరల దుకాణాలున్నాయి. అవసరమని భావించేటట్లయితే కలక్టరు యింకా ఎక్కువ దుకాణాలు తెరువవచ్చు. జొన్న, సజ్జ యితర ధాన్యాలను యీ దుకాణాలకు సరఫరా చేయడానికి ప్రయత్నిస్తానని మంత్రి చెప్పారు

జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ వై. సి తిమ్మారెడ్డి గారు జిల్లాలో ప్రబలియున్న తీవ్రమైన దుర్భిక్ష పరిస్థితులను వివరించి చెప్పారు.

జిల్లా కలెక్టరు శ్రీ ఎల్. సుబ్బయ్య కరువు పరిస్థితులను సమీక్షచేస్తూ పైర్లు బాగా దెబ్బతిన్నాయని చెప్పారు పంచాయతీ సమితులు 400 కరువు సహాయక పనులు చేపట్టడానికి వీలుగా



వ్యవసాయ శాఖామాత్యులు శ్రీ కాకాని వెంకటరత్నం గారు అనంతపురంలో అక్టోబరు 26వ తేదీన పాల శీతల కేంద్రం ప్రారంభించారు.

వాటికి రూ. 16 లక్షలు కేటాయించడం జరిగింది. ఇంతవరకు రూ 9 లక్షలు ఖర్చు అయినాయి. ఇటీవలనే మరొక రూ. 10 లక్షలు విడుదల చేయడం జరిగింది. తక్కావీ ఋణాలక్రింద కేటాయించిన రూ 17 లక్షలలో యింతవరకు రూ 13 లక్షలు పంచిపెట్టడం జరిగింది గ్రామీణ పనుల కార్యక్రమాలకొరకు రూ 12 లక్షలు ఖర్చుపెట్టడం జరిగింది ఇటీవల కొద్దిగా వర్షాలు పడడంవల్ల త్రాగునీటి పరిస్థితి కొంత మెరుగుగా ఉన్నదని కలక్టరు చెప్పారు

రాయలసీమ అభివృద్ధిసంఘం అధ్యక్షులు శ్రీ కె వి వేమారెడ్డి ప్రసంగిస్తూ రాయలసీమలో కరువు పరిస్థితులు శాశ్వతంగా ఉంటున్నాయనీ ప్రస్తుతపు కరువు సహాయక పనులకు తోడుగా శాశ్వత కరువు నివారణ పనులుకూడా చేపట్టాలని ఆయన అభ్యర్థించారు కేంద్ర ప్రభుత్వంనుంచేగాక, ప్రపంచ బ్యాంకునుండి మాస్టరుప్లానుకు నిధులు లభించాలని ఆయన కోరారు స్వాతంత్ర్యం వచ్చి 23 సంవత్సరములు జరిగినప్పటికికూడా అనంతపురం జిల్లా ప్రజలకు త్రాగునీరు సరఫరా చేయలేకపోతున్నామని ఆయన విచారం వ్యక్తపర్చారు.

వైద్య ఆరోగ్య శాఖా మంత్రి కల్యాణ దుర్గం, మడకసిర, హిందూపురం, పెనుగొండ, ధర్మవరం, ఉరవకొండ, గుత్తి తాలూకాలలో రెండు రోజులు పర్యటించి కరువు పరిస్థితులు స్వయంగా చూచి తెలుసుకొన్నారు.

## గ్రామసీమల్లో సామాజికాభివృద్ధి కార్యక్రమాలు

నల్గొండ జిల్లా కలక్టరు శ్రీ కె ఓబయ్య జిల్లా పరిషత్తు హాలులో జాతీయ సామాజిక అభివృద్ధి వారోత్సవాలకు ప్రారంభోత్సవం జరుపుతూ దళిత ప్రజల ఉద్ధరణకు అవిరళ కృషిచేసిన

జాతిపిత మహాత్మాగాంధీకి శ్రద్ధాంజలి అర్పించారు. గ్రామాల ప్రాథమిక అవసరాలను సమకూర్చే ఉద్దేశంతో సామాజిక అభివృద్ధి కార్యక్రమాలు ఆరంభించబడ్డాయి. పీడిత ప్రజానీకానికి గాంధీజీ చక్కని మార్గం చూపారు. నేటి యువతరంవారికి గాంధీజీ సిద్ధాంతాలను బోధించవలసిన అవసరం ఎంతైనా ఉంది. సామాజికాభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలు పాల్గొనడం చాలా అవసరం. సామాజికాభివృద్ధి కార్యక్రమం గ్రామ సీమలలో నవ చైతన్యం తీసుకువచ్చింది అని కలెక్టరు చెప్పారు.

ఈ ఉత్సవ కార్యక్రమాలకు జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ కె. రంగారెడ్డి అధ్యక్షతవహించారు. జిల్లా పరిషత్తు కార్యదర్శి శ్రీ నర్సింగరావు అతిథులకు స్వాగతం చెప్పారు

## అనంతపురం దుర్భిక్ష ప్రాంతాలలో కేంద్ర పరిశీలక బృందం పర్యటన

అనంతపురం జిల్లాలలో దుర్భిక్ష ప్రాంతాలలో పరిస్థితులను పరిశీలించి చేయవలసిన సహాయాన్ని తెలుసుకొనే నిమిత్తం భారత ప్రభుత్వం పంపిన పరిశీలక బృందం హిందూపూరుకు వచ్చింది. శ్రీ పి.జి. సుబ్బారావు, శ్రీ పాండే, యిందులో సభ్యులుగా ఉన్నారు. జిల్లా కలెక్టరు శ్రీ యల్. సుబ్బయ్య, డి. ఆర్. ఒ. శ్రీ నారాయణ, అసిస్టెంటు శ్రీ సమరజిత్ రే, జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ వై.సి. తిమ్మారెడ్డి, యీ బృందం వెంట హిందూపురం తాలూకాలో పర్యటించారు. పంచాయతీ సమితి అధ్యక్షులు తీవ్ర దుర్భిక్ష పరిస్థితులను గురించి భారత ప్రభుత్వ పరిశీలక అధికారులకు వివరించి చెపుతూ భూగర్భ జలాల వినియోగానికి తటాక గర్భములలో సేద్యపు బావులు త్రవ్వించడానికి శాశ్వతమైన చర్యలు తీసుకోవాలని అభ్యర్థించారు. ఈ ప్రాంతంలో పరిశ్రమలను అభివృద్ధి పరచాలని జిల్లా పరిషత్తు అధ్యక్షులు కోరారు. ఈ బృందం మోతుకుపల్లిలో ఒక సేద్యపు బావిని పరిశీలించింది. పెన్నానది ఒడ్డున 55 అడుగుల లోతుగా ఉన్న యీ బావి ఎండిపోయి వుంది. పరిగి గ్రామంలో చెఱువు పూర్తిగా ఎండి ఉంది. ఈ చెఱువులో 60 అడుగుల లోతున ఉన్న బావిలో కూడా నీళ్ళు పూర్తిగా ఎండిపోయి ఉన్నాయి. ఈ చెరువు ఆయకట్టు క్రింద ఉన్న 3000 ఎకరాల భూమి సాగు కాకుండా బీడు పడి ఉన్నది. ఈ బృందం ఎర్రగుంటలో కరువు సహాయక కార్యక్రమం క్రింద జరుగుతున్న రోడ్డు పనులను, హొన్నంపల్లి, జంగాలపల్లి రోడ్డు పనులను పరిశీలించాక తరువాత మడకశిర తాలూకాకు వెళ్ళింది.

## వాణిజ్య పన్నులద్వారా అదనంగా రూ. 10 కోట్లు ఆదాయం

రెవిన్యూ బోర్డు మూడవ మెంబరు, వాణిజ్య పన్నుల కమీషనరు అయిన శ్రీ డి.ఆర్. సుందరం ఏలూరులో పశ్చిమ గోదావరి జిల్లాలోని వాణిజ్య పన్నుల వసూళ్ళను పరిశీలిస్తూ, వర్తమాన ఆర్థిక సంవత్సరంలో రాష్ట్ర ప్రభుత్వానికి ఈ పద్దుల క్రింద రు. 10 కోట్ల ఆదనపు ఆదాయం వస్తుందని చెప్పారు. గత సంవత్సరం వాణిజ్య పన్నుల క్రింద రు. 45 కోట్లు రాష్ట్ర



పంచాయతీ రాజ్ శాఖ కార్యదర్శి శ్రీ బి. ఆర్. కె. శాస్త్రి గారు బుచ్చి రెడ్డి పాలెంలో అక్టోబరు 13వ తేదీన బ్లాకు కోళ్ల పెంపకం క్షేత్రాన్ని ప్రారంభించారు.

ప్రభుత్వానికి వసూలైనాయి. ఆయన జిల్లా కలెక్టరు, వాణిజ్య పన్నుల డిప్యూటీ కమిషనర్లతో చర్చలు జరిపారు. ప్రత్యేక కృషి చేసి బకాయలను వసూలు చేయాలని ఆయన సూచించారు. రెవిన్యూ, వాణిజ్య పన్నుల అధికారులు ప్రతి నెలా సమావేశమై వాణిజ్య బకాయివున్న వాణిజ్య పన్నుల వసూళ్ళను సమీక్ష చేసి, కేసులను పరిసమాప్తి చేయాలని ఆయన సూచించారు. భూమి సేకరణ, భూముల పరిమితి నిర్ణయం విషయాలలో కూడా రాష్ట్రమంతటా ఇదే విధంగా సమీక్షలు జరగాలని ఆయన అన్నారు. సవరించబడిన భూముల పరిమితిచట్టం అమల్లోకిరాగానే ఈ విషయంలో సత్వరచర్యలుతీసుకోవాలని ఆయన కలెక్టరుకుసూచించారు.

## కట్టలేరు ఆనకట్టకు ప్రారంభోత్సవం

ఖమ్మం జిల్లా, మధిర పంచాయతీ సమితిలోని కట్టలేరు ఆనకట్టకు నీటిపారుదల శాఖా మంత్రి శ్రీ యస్. సిద్దారెడ్డి సెప్టెంబరు 11 న ప్రారంభోత్సవం చేశారు. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి సుమారు మొత్తం రూ. 29.70 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది. ఈ ప్రాజెక్టు క్రింద 4,200 ఎకరాల భూమి సాగు అవుతుంది. ఈ సభకు జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ ఆర్. భువన సుందరరెడ్డి అధ్యక్షత వహించారు.

## ట్యూబెక్టమీ శిబిరానికి ప్రారంభోత్సవం

పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు జంగారెడ్డిగూడెంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరుపుతూ పశ్చిమ గోదావరి జిల్లాలో యీ ఉద్యమం భారీ ఎత్తున కొనసాగుతున్నదని ప్రజలు కుటుంబనియంత్రణ పద్ధతులపట్ల సుముఖంగా ఉన్నారని చెప్పారు సెప్టెంబరు నెలలో 6వేల కుటుంబ నియంత్రణ ఆపరేషనులు జరగాలని లక్ష్యం నిర్ణయింపబడినది ఈ లక్ష్యం సాధింపబడుతుందన్న ఆశాభావం ఆయన వెల్లడించారు జంగారెడ్డి

గూడెంలో ట్యూబెక్టమీ శిబిరం నిర్వహించబడుతున్నది. ఈ గ్రామానికి 15 మంచములు కల ఆసుపత్రి మంజూరు అయినది. వచ్చేనెల నుండి యీ ఆసుపత్రి పనిచేయడం ప్రారంభిస్తుందని కలెక్టరు వెల్లడించారు. దేశ జనాభా విపరీతంగా పెరుగుతున్నందు వల్ల మన అభివృద్ధి కృషికి తగిన ఫలితాలు కనిపించటం లేదు. ప్రజా జీవనస్థాయి పెరగాలంటే కుటుంబనియంత్రణ తప్ప వేరే మార్గంలేదని ఆయన చెప్పారు. ఈ ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ ఏ. బాపినీడు ప్రసంగిస్తూ కుటుంబనియంత్రణ కార్యకర్తలు కార్యదీక్షతో పనిచేసి కార్యక్రమాన్ని విజయవంతం చేయాలని విజ్ఞప్తి చేశారు. జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డా॥ నరసింహం ప్రసంగిస్తూ కుటుంబాన్ని పరిమితం చేసుకోవలసిన అవసరాన్ని గురించి చెప్పారు. జిల్లా కుటుంబనియంత్రణ శాఖాధికారి డా॥ కె. వి. రమణాజీరావు వందన సమర్పణ చేశారు.

## గిరిజన సహకార వ్యవసాయ సంఘం ప్రారంభోత్సవం

ఖమ్మం జిల్లా, మధిర తాలుకాలోని రాయిత్పల్లి గంగారం గ్రామంలో సెప్టెంబరు 18న షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల విషయాల పార్లమెంటరీ సంఘం అధ్యక్షుడు శ్రీ కార్తిక్‌చరణ్, గిరిజన సహకార వ్యవసాయ సంఘానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సంఘానికి 1.10 లక్షల ఆర్థిక సహాయం లభిస్తుంది. 170 ఎకరాల ఆయకట్టులో 50 గిరిజన కుటుంబాలకు పునరావాసం కల్పించబడుతుంది.

శ్రీ చరణ్. గిరిజన కాలనీకి కూడా ప్రారంభోత్సవం చేశారు.

కలెక్టరు యీ ఉత్సవానికి అధ్యక్షత వహించారు.

ఆ తర్వాత యీ పరిశీలక బృందం అధ్యక్షుడు కిష్టారం గ్రామంలో 20 మంది గిరిజనులకు రు. 4,100/–ల స్వల్పకాలిక ఋణాలను పంపిణీచేశారు.

## కుటుంబ నియంత్రణ భవనానికి ప్రారంభోత్సవం

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డా. డి. జగన్నాథరెడ్డి, సెప్టెంబరు 18న అనంతపురం జిల్లా కొడిగినహళ్ళి పంచాయతీ సమితిలోని చోళసముద్రంలో రు 12,000/–ల ఖర్చుతో నిర్మించబడిన కుటుంబ నియంత్రణ చికిత్స ఉప కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. శాసనసభ్యులు శ్రీ కె. అంజనరెడ్డి యీ ఉత్సవానికి అధ్యక్షత వహించారు.

ఈ సందర్భంగా శ్రీ జగన్నాథరెడ్డి ప్రసంగిస్తూ జాతి పటిష్టవంతంగా నిర్మించడానికి అనువుగా తమ పిల్లలను ఆరోగ్యవంతంగా పోషించడానికి తోడ్పడే విధంగా కుటుంబ నియంత్రణను పాటించాలని ప్రజలకు విజ్ఞప్తి చేశారు. వైద్యరంగంలో సాధించిన అమోఘమైన అభివృద్ధిని దృష్టిలో పెట్టుకుని కుటుంబ నియంత్రణ విధానంపై శ్రద్ధ వహించాలని ఆయన సూచించారు.



తూర్పు గోదావరి జిల్లా కలెక్టరు శ్రీ ఎల్. మాలకొండయ్య గారు తాళ్ళరేవు హరిజన వాడలో అక్టోబరు చివరి వారంలో విద్యుచ్ఛక్తికి ప్రారంభోత్సవంచేశారు.

---

ఇటువంటి జాతీయ కార్యక్రమాలలో ప్రజలు విరివిగాను, స్వచ్ఛందంగాను పాల్గొనడానికి సామూహిక ప్రబోధం వయోజన విద్యావ్యాప్తి చాలా అవసరమని ఆయన అన్నారు.

## కడప జిల్లాలో అనావృష్టి సహాయ కార్యక్రమాలు

కడప జిల్లా పులివెండ్ల పంచాయతీ సమితిలో సెప్టెంబరు నెలలో కూడా వర్షాలు పడని కారణంగా సమితి ప్రాంతంలో దుర్భిక్ష పరిస్థితిని ఎదుర్కొనడానికి సహాయ కార్యక్రమాలు చేపట్టడంలో అధికార సిబ్బంది చురుకుగా పనిచేస్తున్నది.

సమితిలో దుర్భిక్ష పరిస్థితికి గురిఅయిన గ్రామాలలో రు. 6 లక్షల ఖర్చుతో కూడిన సహాయ కార్యక్రమాలను ముమ్మరంగా అమలు జరుపుతున్నారని సమితి అధ్యక్షుడు శ్రీ డి. రామకృష్ణారెడ్డి అన్నారు. తద్వారా అనేకమందికి ఉపాధి కల్పించ బడుతున్నది.

చేపట్టిన పనులను వివరిస్తూ గ్రామీణులకు ఉపాధి కల్పించే పథకం క్రింద రు. 1. 60. లక్షల ఖర్చుతో వివిధ పనులను చేపట్టారని ఆయన అన్నారు. అనావృష్టి నివారణ సహాయ కార్యక్రమం క్రింద రు. 60, 500 ల ఖర్చుతో పది పనులను చేపట్టారు. వివిధ గ్రామాలలో రు 88 000 ల ఖర్చుతో 22 పాఠశాల భవనాల నిర్మాణం రు. 2 40 లక్షలతో 6 రోడ్డు నిర్మాణం పనులను చేపట్టాలని సమితి అధ్యక్షుడు వివరించారు. దుర్భిక్ష పరిస్థితులను ఎదుర్కొడానికి వీలుగా ఖర్చుకాకుండా మిగిలిపోయిన మొత్తాలనుండి రు. 73,000 లను 4 రోడ్డు నిర్మాణం పనులను మంజూరు చేశారు.

జిల్లా కలెక్టరు శ్రీ ఎన్. వి. గిరి. అనావృష్టి నివారణ సహాయ కార్యక్రమం క్రింద రు. 30,000 ల ఖర్చుతో నాలుగు రోడ్డు నిర్మాణం పనులను మంజూరు చేశారు. ఇటీవలనే సమావేశమైన సమితి ఆర్థిక విషయాల సంఘం, రాయలసీమ అభివృద్ధి

పథకం క్రింద హరిజన వాడలలో 10 మంచినీటి బావుల త్రవ్వకానికి రు. 55,000 లు మంజూరు చేసింది.

సమితి ప్రాంతంలో గ్రామీణ పనుల కార్యక్రమం క్రింద రు: 58,000 ల ఖర్చుతో 5 రోడ్డు పనులు, ఒక లక్ష రూపాయల అంచనా ఖర్చుతో 17 పాఠశాలల కొత్త భవనాల నిర్మాణం పనులను చురుకుగా కొనసాగుతున్నాయి.

## నిజామాబాదులోని దుర్భిక్ష ప్రాంతాలలో కేంద్ర పరిశీలక బృందం పర్యటన

కేంద్రప్రభుత్వం నియమించిన పరిశీలక బృందం సెప్టెంబరు 14,15 తేదీలలో నిజామాబాదులోని దుర్భిక్ష ప్రాంతాలను సందర్శించింది. పరిశీలక బృందం వారు రెండురోజులలో జిల్లాలో దుర్భిక్షానికి గురిఅయిన ఆర్మూరు, కామారెడ్డి తాలూకాలను సందర్శించారు. ఇంకా వారు ఎల్లారెడ్డి తాలూకాలోని లింగంపల్లి, భవానీపేట, హాజీపూర్, గండిమాసానీపేట గ్రామాలను సందర్శించారు. కేంద్ర పరిశీలక బృందం వెంట జిల్లా కలెక్టరు శ్రీ యస్. కె. సూరయ్య జిల్లా అధికారులు కూడ ఉన్నారు.

## కృష్ణా జిల్లాలో కేంద్ర పరిశీలక బృందం పర్యటన

భారత ప్రభుత్వ వ్యవసాయ శాఖోద్యోగి ఆ జి. ఎం. మురీద్, వరి నిపుణుడు శ్రీ యస్. జే. నాయుడు గారలతో కూడిన కేంద్ర పరిశీలక బృందం కృష్ణా జిల్లాలో దుర్భిక్ష పరిస్థితులకు గురైన జగ్గయ్యపేట, నందిగ్రామ తాలూకాలను సందర్శించారు. జిల్లా కలెక్టరు శ్రీ సి. ఎస్ శాస్త్రి విజయవాడ సబ్ కలక్టరు శ్రీ సి మిశ్రా, శాసన సభ్యులు, పంచాయతీ సమితి అధ్యక్షులు, యీ బృందం సభ్యులను షేర్ మొహమ్మద్ పేటలో, కలుసుకొని వారికి లోన కంచీనవాబుపేట, గ్రామాలలో పండిపోయి బీటలుపడి యున్న పొలాలను చూపించారు. నదిగామ పంచాయతీ, ఆఫీసరు ఒక సమావేశంలో కూలిపనులు దొరుకనందున ప్రజలు చౌక ధరల దుకాణాలలో రూపాయకు కిలో చొప్పున అమ్ముతున్న బియ్యాన్ని కూడా కొనలేక పోతున్నారని కేంద్ర పరిశీలక బృందం అధికారులకు చెప్పారు. ప్రతి తాలూకాలో బియ్యం డిపోలు తెరవాలని కూలిచేసే ప్రతికుటుంబానికి ఋణాలు వెంటనే మంజూరు చేయాలని నాగార్జున సాగర్ ప్రధాన కాలువల క్రింద నిర్ణీత ప్రాంతాలలో చిన్న కాలువలు త్రవ్వించే పనులను అమలు జరుపాలని శాసన సభ్యులు, పంచాయతీ అధ్యక్షులు కోరారు. కంచిక చెర్ల అధ్యక్షుడు మాట్లాడుతూ గత మూడేండ్లగా తుపానులవల్ల నేడు, దుర్భిక్ష పరిస్థితుల వల్ల నేమి జిల్లాలో మెట్ట ప్రాంతాలలోని మోతుబరి రైతులుకూడ కూలీలకు పనులు చూపించలేక పోతున్నారని చెప్పారు. ఇంతవరకు చేసిన సహాయం సరిపోదని, అవసరాన్ని పట్టి ఋణాలు యివ్వాలని, జనాభా ప్రాతిపదికపైన చౌకధరల దుకాణాలను తెరువాలని సూచించారు. ఈ బృందం భారత ప్రభుత్వానికి త్వరలో నివేదిక సమర్పించ గలదని కలక్టరు తెలిపారు. త్రాగునీటి కొరతఉన్న ప్రాంతాలలో అవసరమైన చర్యలు సత్వరంగా తీసుకోవడం జరుగుతుందని కలక్టరు హామీ యిచ్చారు. బృందం సభ్యులు విజయవాడకు తిరిగివచ్చిన తరువాత కలెక్టరుతో వివరంగా చర్చలు జరిపారు.

## కుటుంబ నియంత్రణపట్ల గిరిజనులకు ఆసక్తి

నల్గొండ జిల్లాలో కుటుంబ నియంత్ర శిబిరాలు నిర్వహించబడిన సందర్భంలో చింతపల్లిలో 160. దేవూరు ప్రాథమిక ఆరోగ్య కేంద్రలో 104 వేసక్టమీ ఆపరేషనులు జరిగాయి అంతే కాకుండా చింతపల్లి ప్రభుత్వ ఆసుపత్రిలో 41 వేసక్టమీ ఆపరేషనులు కూడా జరిగాయి. ఒకనెలలో శిబిరాలలో మొత్తం 305 ఆపరేషనులు జరిగాయి. ఆపరేషనులు చేయించుకొన్న వ్యక్తులందరూ గిరిజనులే వీరికి మొత్తం 3600 విరోధులు పంచిపెట్ట బడినాయి.

## సామాజికాభివృద్ధి కార్యక్రమాల్లో విలేజిలెవెల్ వర్కర్ల పాత్ర

ఖమ్మం జిల్లా పరిషత్తు హాలులో అక్టోబరు నెలలో విలేజ్ లెవెల్ వర్కర్లు, గ్రామసేవికల మహాసభ జరిగింది. జిల్లా కలెక్టరు శ్రీ ఆర్. పార్థసారధి ఈ మహాసభకు ప్రారంభోత్సవం జరుపుతూ సామాజికాభివృద్ధి కార్యక్రమాలలో గ్రామ స్థాయిలో విలేజిలెవెల్ వర్కర్లు, గ్రామ సేవికలు నిర్వహించవలసిన పాత్రను గురించి ప్రసంగిస్తు అభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం గ్రామాలలో పని చేస్తున్న గ్రామస్తులకు స్నేహితులుగా, ఆప్తబాంధవులుగా వుండాలని గ్రామప్రజల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని కార్య భారములను నిర్వహించాలని కలెక్టరు ఉద్బోధించారు. జిల్లాలోసన్నకారు రైతులకు దుర్భిక్ష పరిస్థితుల కారణంగా రూ. 15 లక్షల తక్కావీ రుణాలు పంచిపెట్టడానికి విలేజిలెవెల్ వర్కర్లు ప్రశంసనీయమైన కృషిచేసినందుకు కలెక్టరు వారిని అభినందిచారు.

భూములులేని విలేజిలెవెల్ వర్కర్లకు భూములు, ఖమ్మంలో వారు ఆఫీసు భవనాన్ని కట్టుకోవడానికి నివేశన స్థలాన్ని కూడా కేటాయించడం జరుగుతుందని కలెక్టరు హామీ ఇచ్చారు. ఈ ఆఫీసు భవనంకొరకు కలెక్టరు సంక్షేమ నిధినించి రూ. 1,000 లు అభినంధించారు.

జిల్లా పరిషతు అధ్యక్షులు శ్రీ ఆర్. భువన సుందరరెడ్డి ఈ మహాసభకు అధ్యక్షత వహించారు. ఖమ్మం జిల్లాలో విలేజిలెవెల్ వర్కర్లు, గ్రామ సేవికలు చేస్తున్న కృషిని ఆయన ప్రసంగించారు.

ఖమ్మంలో ఈ ఆఫీసు భవనానికి జిల్లాపరిషత్తు నిధినుంచి కూడా ఆయన రూ. 1,000 లు విరాళం ఇచ్చారు.

## దుర్భిక్ష ప్రాంతాలలో మంత్రి పర్యటన

రవాణాశాఖా మంత్రి శ్రీ కె. గోపాలనాయుడు అక్టోబరు 21న సత్యవీడు చేరుకోవడంతో ఆయనకు శ్రీ ఇ. వేణుగోపాలరెడ్డి

అధికారులు, అనధికారులు స్వాగతం తెలిపారు. ఆ తర్వాత ఆయన చిత్తూరు జిల్లాలోని దుర్భిక్ష పరిస్థితులను పరిశీలించారు. ఆయన కరువు నివారణ పథకం క్రింద చేపట్టిన కార్యక్రమాల అభివృద్ధినిగూర్చి చర్చించారు. పిచ్చటూరులో ఆయనకు సమితి అధ్యక్షుడు శ్రీ డి గోపాలరాజు స్వాగతం తెలిపారు. ఆ ప్రాంతములోని దుర్భిక్ష పరిస్థితులను గూర్చి సర్పంచ్‌లతోను, అనధికారులతోను ఆయన చర్చించారు. యీ చర్చలలో శ్రీ ఏ చంగల్‌రెడ్డి, శ్రీ గటి చలపతి, శ్రీ జి సుబ్బానాయుడు, ఇతరులు పాల్గొన్నారు. అక్టోబరు 23న ఆయన పుట్టూరు తాలూకాలోని నల్లవెంగనపల్లి గ్రామంలో ఎలమెంటరీ పాఠశాల భవనానికి శంకుస్థాపనచేశారు. అక్టోబరు 27 న చిత్తూరులోని జిల్లాపరిషత్తు హాలులో జిల్లా అధికారులు, అనధికారులు, శాసనసభులు, పంచాయతీ సమితీల అధ్యక్షులు సమావేశమౌతారు. ఈ సమావేశంలో దుర్భిక్ష పరిస్థితులకు సంబంధించి కరువు నివారణ పథకం క్రింద చేపట్టిన విషయాలను గూర్చి చర్చిస్తారు. ఈ సమావేశంలో రవాణాశాఖామంత్రి శ్రీగోపాలనాయుడు కూడా పాల్గొంటారు.

# వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు : ఆర్థిక సహాయం

పరిశ్రమలను ఏర్పాటు చేయడం ద్వారా వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధిచేసే దృష్టితో కేంద్రప్రభుత్వం మన రాష్ట్రంలో దిగువ తెల్పిన జిల్లాలను ఎంపిక చేసింది.

అనంతపురం, కర్నూలు, చిత్తూరు, కడప, మెదకు, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం, నల్గొండ, మహబూబునగర్, నిజామాబాదు, శ్రీకాకుళం, ఒంగోలు, నెల్లూరు.

ఈ జిల్లాలలో ఎర్పాటు చేయబడిన పరిశ్రమల యూనిట్లు పారిశ్రామిక అభివృద్ధిసంస్థ బ్యాంక్ ఆఫ్ యిండియా, భారత పారిశ్రామిక ఆర్థిక సహాయసంస్థ వంటి కేంద్ర ఆర్థిక సహాయసంస్థల నుండి ఆర్థిక సహాయరాయితీలు పొందడానికి అర్హమవుతాయి.

ఈ జిల్లాలలో క్రొత్తగా ఏర్పాటు చేయబడిన పరిశ్రమలకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయకసంస్థ నుండి దిగువ తెల్పిన ప్రోత్సాహం లభిస్తుంది.

1. పరిశ్రమల పరిణామంతో నిమిత్తం లేకుండా సంవత్సరానికి 7 శాతం చొప్పున వడ్డీ రాయితీ.
2. బ్యాంకు, భవనాలు, యంత్ర పరికరాలతో సహా 3 లక్షలకు మించని పెట్టుబడి కలిగిన భారీ పరిశ్రమలకు సంబంధించి భూమి భవనాలకు 75 శాతం, యంత్రపరికరాలకు 85 శాతం మేరకు కార్పొరేషన్ ఋణాలను యిస్తుంది.

మరీ వెనుకబడియున్న ప్రాంతాలలో పరిశ్రమల ఏర్పాటును ప్రోత్సహించడానికి ఎంపిక చేయబడిన ప్రాంతాలలో 10 శాతం నిర్దిష్టమైన సబ్సిడి యివ్వడానికి కేంద్రప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. రు 50 లక్షలను మించని పెట్టుబడిగల క్రొత్త పరిశ్రమలకు యీ సబ్సిడీ లభిస్తుంది

రు. 50 లక్షల నుమించిన పెట్టుబడిగల పరిశ్రమల విషయంలో వాటి అర్హతలను బట్టి సబ్సిడీ మంజూరుచేసే అధికారం కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలకు ఉంది. 1970 అక్టోబరు 1వ తేదీ తర్వాత పటిష్టమైన చర్యలు తీసుకున్న పరిశ్రమలు యీ సబ్సిడీకి అర్హమవుతాయి. క్రొత్త పరిశ్రమల యూనిట్లు యీ సబ్సిడీని పొందడానికి సంబంధించిన నియమనిబంధనలు రూపొందించబడుతున్నాయి.

## రాయలసీమ ప్రాంతంలో సబ్సిడీలకు అర్హమైన ప్రదేశాలు

1. చిత్తూరుజిల్లా: చంద్రగిరి.
2. కడపజిల్లా : కమలాపురం, కడప, పులివెందల రాజంపేట, కోడూరు సిద్దౌట్.
3. అనంతపురంజిల్లా . సింగమాల, తాడిపత్రి, గుత్తి.
4. కర్నూలుజిల్లా కర్నూలు, ఆదోని.

## తెలంగాణాప్రాంతంలో సబ్సిడీలకు అర్హమైన ప్రదేశాలు

1. మెదకుజిల్లా. సిద్ధిపేట.
2. కరీంనగర్‌జిల్లా పెద్దపల్లి, సుల్తానాబాదు, కరీంనగర్ హుజూరాబాదు.
3. వరంగలుజిల్లా: హన్మకొండ, నరసంపేట.
4. ఖమ్మంజిల్లా: ఖమ్మం, తిరుమలాయపాలెం.
5. నల్గొండజిల్లా: సూర్యాపేట, నల్లగొండ, మునుగోడు, నకిరేకల్లు.
6. మహబూబ్‌నగర్: కల్వకుర్తి, ఆమనగల్లు

## మునిసిపాలిటీలు

ఖమ్మం, నల్గొండ, సూర్యాపేట, కరీంనగర్, సిద్ధిపేట.



వాణిశ్రీ



ముఖ్యమంత్రి ప్రసంగం

# నగరంలో

ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారు నవంబరు 1వ తేదీన 1969, 1970 సంవత్సరాలకు ఉత్తమ చలన చిత్రాలకు ప్రభుత్వ బహుమతులు అందజేశారు.

సమాచార పౌరసంబంధ శాఖ మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావుగారు అధ్యక్షత వహించారు.



యస్. వి. రంగారావు

శ్రీ కె. ఎన్. రామూ





నటీమణులతో సమాచార శాఖామాత్యులు ప్రసంగిస్తున్న దృశ్యం



కవి సమ్మేళనం (అక్టోబరు 31)



ఉపముఖ్యమంత్రి ప్రారంభోత్సవం

# వార్తా చిత్రాలు

ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవాల సందర్భంగా జరిగిన మూడురోజుల సాంస్కృతిక కార్యక్రమాలకు ఉపముఖ్యమంత్రి శ్రీ బి.వి. సుబ్బారెడ్డిగారు నవంబరు 1వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. అక్టోబరు 31వ తేదీన కవి సమ్మేళనం జరిగినది.

అంతకుముందు నగరంలో మూడురోజులపాటు బల్గేరియన్ నృత్యనాటక ప్రదర్శనాలు జరిగాయి.



శ్రీ ఈమని శంకరశాస్త్రి వీణకచేరీ



బల్గేరియన్ నృత్యనాటకంలో ఒక దృశ్యం

కూచిపూడి నృత్య ప్రదర్శనం





# పుష్కలమైన పంటలకు ఫాక్టమ్‌ఫాస్

అన్ని రకముల భూములకు, పైర్లకు, అనుకూలమై తన ఆదిక్యతను నిరూపించుకున్న, అద్భుత సంకీర్ణ ఎరువు దక్షిణ ప్రాంత రాష్ట్రముల రైతులు విరివిగా వాడు ఎరువు భారత దేశంలో రసాయన ఎరువుల ఉత్పత్తికే పునాది వేసిన బ్రహ్మాండమైన ప్రప్రధమ ఫాక్ట్ ఎరువుల ఫాక్టరీ ప్రతిష్టను చాటే ఎరువు

వరి పైరుకు శిఫారసు చేయబడ్డ ఎరువుల మోతాదులు ఎకరాకు కిలోగ్రాములలో

| | ఫాక్టమ్‌ఫాస్ 16 20 | మ్యూరియేట్ ఆఫ్ పొటాష్ | యూరియా |
|---|---|---|---|
| వరి | | | |
| (ఎ) అధిక దిగుబడినిచ్చే రకాలు | 180 | 50 | 58 |
| (బి) దేశవాళీ రకాలు | 135 | 26 | 12 |




**ఫాక్ట్** కర్షక బంధు

## ది ఫర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ ట్రావెన్‌కూర్ లిమిటెడ్, ఉద్యోగమండల్ - కేరళ

ఆంధ్రప్రదేశ్ ఏరియా ఆఫీసు షాపూర్‌వాడి, హైదరాబాద్ - 4

ప్రాంతీయ కార్యాలయాలు - నిజామాబాద్ వరంగల్ కర్నూలు నెల్లూరు

aries EKM FT 152 TL

PRINTED BY THE DIRECTOR OF PRINTING GOVT OF ANDHRA PRADESH AT THE GOVT CENTRAL PRESS HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION PUBLIC RELATIONS & TOURISM ANDHRA PRADESH HYDERABAD

# ఆంధ్రప్రదేశ్ గురించి

* **1971** జనాభా లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ జనాభాలో **7.93** శాతానికి, ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం భారతదేశ విస్తీర్ణంలో **9** శాతానికి సమానం.

* ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం **2.75,109** చ. కి. మీటర్లు.

* **1971** లో సేకరించిన లెక్కల ప్రకారం. ఆంధ్రప్రదేశ్ జనాభా **4,33,94,951** మంది. దేశజనాభా **54,69,55,945**.

* **1971** లెక్కల ప్రకారం, రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు **24.56** శాతం మంది వున్నారు. **1961** లో **21.19** శాతం. భారతదేశం మొత్తంమీద వున్న అక్షరాస్యుల శాతం **1971** లో **29.35. 1961**లో **24.03** శాతం.

* మన రాష్ట్రంలో జనాభా సాంద్రత చ. కి. మీ. **1**కి **157** మంది హైదరాబాదు జిల్లాలో సాంద్రత చ. కి. మీ. **1**కి, **362.** అన్ని జిల్లాల కంటే యిది ఎక్కువ. అదిలాబాద్ జిల్లాలో జనాభా సాంద్రత **79** మంది. అన్నింటి కంటే యిది తక్కువ.

* రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయం (**1960-61** నాటి ధరలు) మొదటి ప్రణాళిక అంతానికి రూ. **281**లు, రెండవ ప్రణాళిక అంతానికి రూ. **306**లు, మూడవ ప్రణాళిక అంతానికి రూ. **333** ల చొప్పున ఉంది. నాలుగవ ప్రణాళిక ముగింపు నాటికి తలసరి సగటు ఆదాయం రూ. **430** లకు పెరుగుతుంది.

* రాష్ట్రంలో **1,000** అడుగుల లోతు మేరలో సుమారు **1,000** మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు వున్నాయి. **2,000** అడుగుల లోతు మేరలో **1,320** మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు లభించగలవని అంచనా.

* భారతదేశంలో, బారైట్స్ ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్‌దే అగ్రస్థానం. దేశంలో ఉత్పత్తి అయ్యే బా రైట్స్‌లో **90** శాతం మొదలు **95** శాతం వరకు రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నది.

* అభ్రకం ఉత్పత్తిలో బీహారు, రాజస్థాన్ రాష్ట్రాల తరువాతి స్థానం ఆంధ్రప్రదేశ్‌ది.

